యీవివరముల నిచ్చట ముచ్చటించితిని. ఇప్పటి పరిస్థితులు విపరీతముగ మార్పు జెందినను, నేనుచాల కాలము నాసోదరుల నెడబాసి చెరసాలయందుండియుంటచేయీమార్పు నాకచ్చెరువుగలిగించెను. అంతటనుండియు హిందూమహమ్మదీయులొకరియెడ నొకరు శత్రుత్వమును పాటించుటమానిరి. ప్రత్యర్థులమని యైనదలంచుకొనరైరి. వారంతటనుండియు, సోదరులును సహచరులునై మెలంగజొచ్చిరి. ఆచారదూరమై ఆర్భాటసహితమై తైలవష్టియై ఫలశూన్యమైన యుపన్యాస పరంపర లంతమొందెను. కాంగ్రెసు తీర్మానములు నిక్కువముగ తీర్మానములే యనియు, ప్రజలు వాని నాచరించుటకై తీర్మానించుకొనినవనియును దెల్పుటకై యొకవిధమగు పట్టుదల ప్రజలనావహించెను. మరియు నికముందు దైవమునకుదక్క మానవమాత్రునకు భీతినొంది భారతీయులేకార్యమును జేయనొల్లరని దెల్లమయ్యెను. ఈ విపరీత పరిణామము, నన్నాశ్చర్య నిమగ్నునిజేసి, నేనమృతసరస్సున నుపన్యసించుచుండ నొకానొక సోదరపౌరుని పద్యపాదము జ్ఞప్తికిదెచ్చెను. ఆపద్యమున నిట్లు వచియింపబడియుండెను:- "మద్యపానము మరల దిరిగి వచ్చుసరికి యొక శతాబ్దము గడచినట్లుండెను. మద్య విక్రయశాలను వీడునపుడు మాకు ప్రపంచమంతయు మార్పు జెందినట్లుండెను."

—: సహకారమును వీడి సహాయనిరాకరణము నవలంబించుట :—

ఇంతవరకును ప్రజల ప్రవర్తనలోను భావప్రపంచమునందును జనించిన మార్పులనే వివరించితిని. ఇంతేగాక వారల రాజతంత్రము గూడ ఆకస్మికముగ మార్పు జెందెను. అమృతసరస్సున ప్రజల నధికారులతో సహకారము సల్పుడని ప్రేరేపించిన మహాత్ముడే, ప్రథమమున సహాయ నిరాకరణ వాదియయ్యెను. రాజకీయవ్యవహారముల నిట్లు మార్పునొందించినదేది? యుద్ధసమయమునను ముఖ్యముగ 1918 సంవత్సరాంతమున తాత్కాలిక సంధిగావింపబడిన పిమ్మటను ప్రభుత్వము



యెడ నాయభిప్రాయములుగూడ మార్పుజెందెనని యొప్పుకొనక తప్పదు. ఈప్రభుత్వమువలన కేదియో లాభ మొనగూడుననని యాశలబెనంగి, 1911 సంవత్సర ప్రారంభమునను 1914 సంవత్సరాంతమునను వెనుకటి 'కామ్రేడు' పత్రికలలో నేనువ్రాసిన వ్రాతలను మరల నిప్పుడు జదువుచుండ రూపనాశనమైన నొక కళేబరముయొక్క శల్యములను బరికించుచుండినట్లుండును. ప్రభుత్వముతో సహకార మొనర్చువిషయమున 1919 సంవత్సరము డిశంబరు మాసమువరకును మహాత్మునకును లోకమాన్య దేశబంధులకును మధ్యస్థముగా నుంటిని. చివరకు కాంగ్రెసు సభకూడ యీస్థానమునకే వచ్చి చేరెను. అప్పుడుకూడ ప్రభుత్వముతో నట్టి సహకారము సాధ్యమగునను యాశ నాకంతగా లేకుండెను. మహమ్మదీయుల(సర్కారుతో) సహకారమెట్టివిపరీతపరిణామమునకు గారణభూతమగునో నాకు విదితమయ్యెను. అమృతసర వీధులందును-ప్రజలుపొట్టచే బ్రాకినవీధులు-జలియన్వాలాబాగునందును మానియన్వాలాభవనమందును జరిగినవిపరీతములు అధికారుల నురాగ్రహము వలన జనించి యొకదానికి నొకటి సంబంధములేని సంభవములు గావనియు ఈదుర్ణయపరంపరలు విదేశీయ నిరంకుశ ప్రభుత్వములకు దప్పక కలుగుచుండు వ్యాధి చిహ్నములనియు నేను దృఢముగ నమ్మితిని. ఈరోగముఅట్టి రాజ్యాంగపద్ధతితోనే బుట్టుచుండుననియు అట్టిపద్ధతి మారనంతవరకు యట్టిసంభవములు మరల మరల జరుగుచునే యుండుననియు పరిపాలకుల హృదయములు సంపూర్ణముగ మార్పునొందినగాని ప్రభుత్వము జలియన్వాలాబాగు పరంపరలే యగుచుండుననియు నేనెరింగితిని. నూతన శాసనసభల ప్రారంభోత్సవము సల్పుటకై కన్నాట్టు ప్రభువు భారతవర్షమున కరుగుదెంచిన తరుణమున "జరిగినదేదో జరిగినది, జరిగినది మరచిపొండు. మన్నింపుడని" వాక్రుచ్చెను. నేనుమన్నించుటకు యిదివర

కును సిద్ధముగా నుంటిని. ఇప్పుడును సంసిద్ధముగా నున్నాను. కాని మఱచిపోవజాలను.

మరచిపోవను. మరచిపోవుటయన మేల్కొన్న వారలు మరల నిద్రించుటయే యగును. నిజతత్త్వమును దెలిసికొనుటకుబూర్వము కనుచుండు రమ్యమగు కలలనే మరలగనుచుండుట యగును. అప్పటికింకను మహాత్ముడు యదార్థమును గ్రహింపలేదు. ఆయనలో మార్పు తర్వాతజనించెను. అమృతసర సభముగిసినపిదప చాలరోజులవరకును, యింగ్లీషువారు పశ్చాత్తాప పడుచుందురనియే ఆయన యాశించుచుండెను. ఖిలాఫత్తుయొక్క స్వాతంత్ర్య గౌరవములను, పునరుద్ధరించి జజీరతుల్ అరబ్బును"విడిపోయి, పంజాబు దురంతములకు తగిన ప్రతీకార మొనర్తురనికూడ యాశగొనెను. అయ్యది కేవలము ఆశయేగాదు. సంపూర్ణవిశ్వాసమనజెల్లును. ఇదియెయాయన కింతవరకును ధైర్యముగొల్పెను. ఆయనకుగూడ భ్రాంతివిచ్ఛేదమయినతోడనే ఆయనకార్యక్రమమును తయారుచేయుటలో యింగ్లీషువారు సద్భావప్రేరితులని దానెన్నడును నమ్మజాలనని సూచించినపుడు, మేముకూడ యీయన తీవ్రముగా బోవుచుండెనని దలంచితిమి. అందులకాయన "నూతనముగ మార్పుజెందిన వాడనగుటచే మరింత యుద్రేకపూరితుడనైతినని" చెప్పెను. ఖిలాఫతు రాయబారుల ద్వారా యింగ్లాండునకు సందేశమంపినపుడు, వారాయబారులు ప్రధానమంత్రియగు లాయడు జార్జిగారిని దర్శించి విఫల మనోరథులయినప్పుడును, యింగ్లాండు దొరతనము వారికంపబడిన కడపటి రాయబారమట్లు ఫలరహితమైనప్పుడును, ఇక దరఖాస్తులతో లాభములేదని దెలినప్పుడును, పంజాబు దురంతములు, పొరపాటున జరిగెనని వ్రాసివేసినప్పుడును, నిరపరాధులగు భారతపుత్రుల హతముగావించిన హంతకునకును. దుర్ణయముల "పొరబాటు" నిసమర్థించి ఆయుధభటులచే పరివృతుండై హాయిగ గులుకుచుండు



యధికారికిని, నిరుపేదలగు హైందవుల కష్టార్జితమునుండి పెన్షనులనిచ్చినప్పుడును, మహాత్మునకును సహకారమునందు విశ్వాస మడుగంటెను.

## —:సహాయనిరాకరణము:—

సహాయ నిరాకరణమును గూర్చి విశేషముగ పలువురు చెప్పియున్నారు. పలువురు వ్రాసియున్నారు. అట్టి స్థితియందింకను దానిభావము తమకు బోధపడలేదని మనవిరోధులును, కొందరు మనమిత్రులు నయితము అనినపుడు, నేనీయుపన్యాసమువలన వారిని తృప్తిపరుపజాలను. కావున సహాయనిరాకరణమనిన నేమియో క్లుప్తముగ చెప్పి వదలివేసెదను——పాపమును మనమెదుర్కొన జాలకపోయినను అధమపక్షము దానికి సహాయముచేయకుండ నైననుండవలెను. సహాయ నిరాకరణ సిద్ధాంతమిదియే. సహాయ నిరాకరణోద్యమమున కవస్యమగు త్యాగపరంపరల గావించుటకు భారతజాతి సంసిద్ధమైనచో, ప్రస్తుత విదేశీయ ప్రభుత్వము స్తంభించి పోవుననుమాట వాస్తవము. అట్టిఫలితము కలుగవచ్చునని మనమెరుగుదుము. కాని కేవలము అందుకొరకే మనముకృషి సలుపుటలేదు. మనయుద్యమము విధ్వంసమునకే ఏర్పడినదని దానినామమును బట్టి తోచుచున్నను, నిజమునకట్టిదికాదు. విధ్వంసమునకన్న నిర్మాణమే దాని ముఖ్యోద్దేశమైయున్నది. ప్రత్యేకముగ నితరులను స్తంభింపజేయు నుద్దేశము దానియందు లేదు; మన శక్తినే స్తంభించియుండుటచే మనయశక్తతను పారద్రోలుటకై సర్వయత్నముల సలుపుట ప్రధానవిషయము. సహాయనిరాకరణ కార్యక్రమమందలి ప్రతివిషయమునకును, విధ్వంసముతో పాటు బలవత్తరమైన నిర్మాణవిధికూడగలదు. మననిర్మాణశక్తి నెట్లు విజృంభింపజేయుదుమో, దానిని బట్టియే మన జయాపజయములు నిర్ణయము.

గును. కాని విధ్వంసకార్యమును మానివేసి, అనగా, ప్రభుత్వమువారు తమశాశ్వత కళ్యాణమునకును మన వినాశమునకును తోడ్పడుటకై నిర్మించిన సంస్థాపనల నన్నిటిని మనమింకను నుపయోగించు కొనదలచినచో, మనకు జయమును లేదు. అపజయమును లేదు. మనజాతి కేవలము నశించిపోవును. ఒకవేళ ప్రభుత్వమును స్తంభింప జేయుటయే మన ప్రత్యక్షోద్దేశమైనను యుత్తమ నైతిక ధర్మమునకు వ్యతిరేకము కాదు. నాటి ఏసుక్రీస్తు నేటి మహాత్మాగాంధి గారల ప్రేమతత్వమునకు సైతము వ్యతిరేకముకాదు. మరియు అట్లు ప్రభుత్వమును స్తంభింపజేయుట తప్పక సాధ్యమనికూడ నేనమ్ముచున్నాను. మిత్రులారా, నేను కారాగృహవాస మనుభవించుచుండిన ప్రథమదినములలోనే మనదేశపు చెరసాలలలో గన్పట్టు సహకారపద్ధతుల గమనించి యాశ్చర్యమున మునిగితిని. మాసము సందాతను సక్రమముగ ప్రవర్తించిన ఖైదీలకు ప్రతిమాసమునకును కొన్ని దినములు ఖైదు తగ్గింపబడును. ఈ పద్ధతి ప్రతిఖైదీకిని వర్తించును. కాని జైలుయుద్యోగులకు నమ్మకము గలిగించి వారిదయను సంపాదింప గలిగిన ఖైదీలుకొందరు ప్రతిమాసమునకును తమఖైదు నందెక్కువరోజులు తగ్గింపును పొందుటయేగాక కాపలావారుగను ఓవరుసీర్లుగను ఉద్యోగములను సంపాదింప గలుగుదురు. వారు ఖైదునందున్నంత కాలమును ఇంకను అనేకములైన సౌకర్యముల ననుభవింతురు. చెరసాలయని వ్యవహరింపబడు స్వాతంత్ర్యద్వారమును జొచ్చినవారు పలువు రీసభాస్థలి నలంకరించియున్నారని నమ్మెదను.

జీతములు పుచ్చుకొని పనిచేయు మామూలు 'వార్డరు' లతోపాటు, రాత్రివేళల గస్తీతిరిగి చెరసాలను కాపాడుచుండు నీఖయిదీ వార్డరుల పనివిశేషమును వారెల్లరును (చెరసాలకేగిన మిత్రులు) బాగుగ నెరుంగుదురు. జీతముపుచ్చుకొను వార్డరులు కొద్దిమందియును



సాధారణముగ సుఖనిద్రననుభవించుచునో, లేక కునికిపాట్లు పడుచునో, రాత్రి గడుపుచుందురు. అసలు పనియంతయు చేయుచుండు 'ఖైదీ వార్డరులు' రాత్రి ప్రతి అరగంటకును జైలునాలుగు మూలలు ప్రతిధ్వనించుచున్నట్లు 'అంతాసురక్షితముగనున్న' దని కేకలు వేయుదురు. ఖయిదీ లీప్రకారము సేవజేయుచున్నంతవరకును, జీతము పుచ్చుకొను వార్డరులు నిష్కల్మష హృదయులైనవారివలె హాయిగ నిద్రపోవచ్చును. మిత్రులారా! ఇదియే సహకారపద్ధతిని గూర్చినేచెప్పదలచిన నీతికథ. మనము మన స్వాతంత్ర్యమును కోల్పోయినాము. మనవలెనే స్వాతంత్ర్యరహితులైన మనదేశీయులుకొందరు సర్కారుకు తోడ్పడుటవలన, మనల నణచిపెట్టుటకు వీలగుచున్నది. ప్రభుత్వమున కీవిధముగ తోడ్పడుచున్న మనదేశీయుల కెవ్వరికో కొన్ని స్వల్పసదుపాయము లున్నటులగుపడినను, నిజమునకు వారును మనవంటి బానిసలే. మన తోడిబానిసలు భారతవర్షమను నీవిశాలకారాగారమున నెల్లదిశలనుండియు "అంతయు సురక్షితముగ నున్నద"ని యభయమిచ్చుచు కేకలిడుచున్నందుననేగదా, మనయజమానులగు స్వల్పసంఖ్యాకులైన విదేశీయులు హాయిగ విశ్రాంతిగైకొనుచు నిద్రింపగలుగుట! ఈరెండుస్థితులకును గలభేద మొక్కటే మాత్రమున్నది. మామూలుచెరసాలలో వార్డర్లుగను ఓవరుసీర్లుగనుండి తమతోడిఖయిదీల నణచిపెట్టియుంచిన ఖయిదీలు, తక్కిన ఖయిదీలకన్న కొంత త్వరితముగ బంధవిముక్తులమగుదుమని యాశగలరు. కానిమన సహకారవాద స్నేహితులన్ననో, మనవంటి బానిసలగుటయేగాక మనకన్న ముందుగ విడుదలనొందగలమనుతృప్తినైన ననుభవింపజాలరు. ఇంకొకచిత్రము. వీరుదాస్యమును ననుభవించుచున్నామను జ్ఞానమైనను లేక, తమ్ముబాధించు సంకెలలజూచుకొని మురిసిపోవుచున్నారు.

నేను చెరసాలలో వ్రాసినట్లు;

"వెఱ్ఱివాడా! నాకై చింతింపకుము. నీదాస్యమును గూర్చి విలపింపుము—నీవు దివ్యాభరణమని దేనిని చూచుకొని సంతసించుచున్నావో, అదియే నీకు శృంఖలమగుచున్నది."

—♦ మహమ్మదీయులకొక ధర్మసందేశము. ♦—

మిత్రులారా! సిపాయి విప్లవమునాటినుండి నేటి సహాయనిరాకరణ శకము వరకునుగల చరిత్రనంతయు నింతవిపులముగ చర్చించి, మీకును నాకునుగూడ విసుగు గలిగించితినని తలంచుచున్నాను. పూర్వచరిత్ర వివరించుటలో నాయుద్దేశమొకటి గలదు. మీపైనిరంకుశాధికారము నేవహింపజాలను. అయినను మీతోడ్పాటు నాశించుచున్నాను. మహాత్మునికిగల ప్రతిభ నాయందు లేదు. మిమ్ము నమ్మోహితుల జేయవలెనను వాంఛగాని అందులకు వలయు వశీకరణశక్తిగాని నాకు లేవు. నాజీవితకాలము నందర్ధభాగము శ్రమపడి తప్పుత్రోవల సంచరించి సంచరించి, చివరకు కావించుకొనిన సిద్ధాంతములను మీకును తెలియజెప్పవలెనన్న, మనకు పూర్వము అనేకతరములవారి యనుభవమును బట్టికూడ నాయుద్దేశముల యాదార్థ్యము వెల్లడికాగలదని రుజువుచేయుటకంటె వేఱుపద్ధతికలదా? ప్రత్యక్షానుభవమే మన విజయచిహ్నము. ఏలనన మనలబాధించిన అస్త్రసముదాయమే అనుభవము. అరువది వత్సరములనుండియు జరిగినచరిత్రాంశములనుబట్టి నాసోదర మహమ్మదీయు లనుసరింపవలసిన మార్గమునుండి వారిని త్రిప్పివేయవలెనని ప్రబలయత్నములు సలుపబడుచున్నవి. కావున నీసందర్భమున వారియనుభవమే వారికి పరమప్రమాణమని హెచ్చరించుచున్నాను. సహాయనిరాకరణోద్యమము నిష్ఫలమైనదని యొప్పుకొందము. మహమ్మదీయేతరులగు సోదరదేశీయులతోడి సహకారము కేవలము అసంభవము బూటకము వెఱ్ఱియే, అను-



కొనుడు. (వాదమునకైతప్ప నేనువీని నంగీకరించుటలేదు.) అట్లైనను సహాయనిరాకరణముకాక వేరుమార్గమును మనము సూచింపవలెనుగదా! ఈవిషయమున నాసోదరమహమ్మదీయులు నామార్గమునే యనుసరింప నక్కఱలేదు.—నాకే వారు మార్గదర్శకులు కావచ్చును. మనవిదేశీయ యజమానులపట్ల సహాయనిరాకరణమును, తోడిబానిసలతో సహకారమును అసంభవములైనచో వేరుమార్గమేమి చూపెదరు? తక్కినసంఘములతో సమానులమగువరకును ముందునకుసాగి వృద్ధినొందుటకు బదులు వెనుకకు నీడువవలెనా? విదేశీయులగు ప్రభువులతో సహకారమును నెరపి పూర్వమువలె మహమ్మదీయేతర ప్రజలతో పోరాడుదమా? అట్లొనర్చినచో ట్రిపోలీ బాల్కనుయుద్ధముల పిమ్మటను వంగదేశవిభజన రద్దుకావింపబడిన సందర్భమునను జరిగినదానికన్న నెక్కుడు న్యాయము మనకు గలుగగలదను నాశయున్నదా? లేదు. లేదు. స్నేహితులారా! ఆయధ్యాయము ముగిసినది మరలనావంక చూడజాలను. విదేశీయులపట్ల సహాయనిరాకరణమును, స్వదేశీయులతో సహకారమును తప్ప మీకుగాని నాకుగాని వేరుమార్గములేదు. లేనిదాని విషయమై చర్చించి కాలహరణ మొనర్ప నేల?

—: మాంటాగూగారి రాజీనామా; దానిప్రాముఖ్యత :—

లాసేను సంధియైన తరువాత మనకసంతృప్తికారణమే లేదని చెప్పుచున్నారు. ఒకటిన్నర సంవత్సరములు దాదాపు యేకాంతశిక్ష ననుభవించినందుచే ప్రపంచ వ్యవహారములతో నాకు సంబంధము లేకపోయెను. ఆకారణమున నాసంధియెట్లుసంభవించెనో నాకంటె మీకే బాగుగ తెలిసియున్నది. నేనింకను కారాగృహమునను్న కాలమున చేసికొనబడిన 'సెవర్సు' సంధినిమార్చవలెనను ప్రయత్నసందర్భమున జరిగిన విషయములన్నిటినిగూర్చి కొంతవరకు ఆకాలమున ప్రకటింప

బడినప్రాత వార్తాపత్రిక సంచికలనుండి తెలిసికొనగలిగితిని. మంత్రివర్గ సహితములైన రాష్ట్రీయప్రభుత్వములయొక్క సలహాగొని, కేంద్ర ప్రభుత్వము వారిండియా మంత్రిగారికి పంపిన సుప్రసిద్ధమైన తంతివార్తను మీారెరిగియే యున్నారు. అందుమహమ్మదీయక్షేత్రములపై ఖాలీఫా గారి పరిపాలనముతప్ప, 'జజీరతుల్ ఆరబ్'ను ఖాళీచేయుటనుగూర్చి ముచ్చటింపకనే పోయిరి. అందుచే వారు మహమ్మదీయాశయములను తృప్తిపరుపక పోవుటయేగాక మహమ్మదీయ మతధర్మములనైనను పాటింపకపోయిరి. ఇండియాప్రభుత్వమువారు "భారతదేశముయొక్క కోరికలను సంపూర్ణముగ సంతృప్తిచేయుట యసంభవము కావచ్చునని మాకు తెలియును"ని వ్రాయుచు, జజీరతుల్ ఆరబ్‌నుగూర్చి తమ రెత్తుకొన లేదని గట్టిగా కాకపోయినను మొత్తముమీాద యొప్పుకొనినారు. ఛేంబర్లేనుగారు మాత్రము తురుష్కుల ప్రియమిత్రుల కోరికలను కూడ నిర్వహించినవి యని" చెప్పుటకు సాహసించెను. అట్లయ్యు నట్టి తంతివార్తయొక్క ప్రకటనమువలన ప్రపంచమునం దంతటను గొప్ప కలవరము కలిగెను. ఇండియామంత్రి రాజీనామా నియ్యవలయునని ప్రధానమంత్రి బలవంతముచేసెను. ఆరాజీనామాను శ్రీచక్రవర్తిగారు "దయతో నంగీకరించిరి." అనగా మాంటాగూగారు నీచముగ పదభ్రష్టుడుగాచేయబడెను. పార్లమెంటునయూనియనిస్టుకక్షులలో నధిక సంఖ్యాకులు ఛేంబర్లేనుగారి ప్రకటనమును, స్వాగతమును సూచించు గంభీర కరతాళధ్వనులతో గ్రహించిరని" రూటరు ప్రకటించెను. భారతదేశ గర్భశత్రువులు సంపూర్ణానందముచే నొడలు మరచిరి" రూటరుమరలట్లు వ్రాసెను.

"మాంటాగూగారి రాజీనామాను ప్రకటించినప్పటి కరతాళముల ప్రతిధ్వని యెన్నడును వినియుండలేదు. యూనియనిస్టుల స్థానమునుండి బయల్వెడలినను దీర్ఘముగుటచే సార్వజనీనముగ కనబడెను' కొందరు



ద్రేకపూరితులు చేతిరుమాళ్ళనుకూడ విసరిరి." స్వపరిపాలనము విదేశీయ ప్రభుత్వము దానమియ్యవలయునను నభిప్రాయమునే యిప్పటికిని నమ్ము భారతీయులలో, కార్మికపక్షము అధికారపదవికివచ్చినయెడల తమకేమోతప్పి తలకెత్తుమరను నమ్మకము కలదు. ఈపక్షము యొక్కయు మాంటేగూగారి స్వంతపక్షముయొక్కయు అప్పటియభిప్రాయమునీక్రింది వాక్యముచే రూటరు తెలియజేసెను. "లిబరలు లేబరు పక్షములవారుమాకీభావముతో ప్రకటనమును శాంతముగగ్రహించిరి"

ఇందుచే నాపక్షములవారికికూడ మాంటేగుగారి రాజీనామా సాకల్యసమ్మతము కాకపోయినను, అసమ్మతము కాదని తేలుచున్నది. ముసల్మానులకును బ్రిటనుదేశమునకు మధ్యనుండు తగాదాలను సంతృప్తికరముగ పరిష్కరించుటలో మహమ్మదీయ నాయకుల కున్నంత పరితాపము ప్రభుత్వమువారికికూడ కలదని యిప్పుడు వారు చెప్పవచ్చును "ఇండియాప్రభుత్వము బ్రిటిషుప్రభుత్వముయొక్క బహుదూరస్థమైన సేవక ప్రభుత్వముమాత్రమే యగుటచే, ఇట్టిసందర్భముల నెట్లు ప్రవర్తింపవలయునో యావిషయిని సూచించు" లార్డుకర్జన్‌గారి "కసహ్యాకరముగ" కన్పట్టుచుండ మనకట్టి పరితాపమువలన నేమిప్రయోజనము కలదు? పాపము, మాంటాగూగారు తనను మన్నించి వదలివేసిరిగదాయని సంతసించుచుండ నాయనను శిక్షించుటకు కొంచెముపూర్వము లార్డుకర్జన్‌గారు పైమాటలను వ్రాసిరి. "డన్లాపి"నగరమున నొక్కతప్పునకే రెండుశిక్షణములున్నవని మాంటాగూగారికి తెలియదు కాబోలు! లార్డుకర్జన్‌గారి న్యాయస్థానము మాంటాగూవంటి నేరస్థులను మన్నించివదలక, అదేనేరమునకు బెదరించియు శిక్షించియు తప్పక రెండు శిక్షలను వేయుగలదని తెలియదు కాబోలు! ప్రభుత్వముతో సహాయనిరాకరణమును, మనలో పరస్పరసహాయమును, నను నీరెండు పద్ధతులుకూడ రుచించని మితవాద మహమ్మదీయ సోదరుల

లో నెక్కడైనను బ్రిటిషువారు భారతీయ మహమ్మదీయుల భావములను లేశమాత్రమైన నాదరించెనని గుండెపై జేయివేసుకొని చెప్పగలడా? 1905 సంవత్సరమున బంగాళావిభజన సందర్భమున మహమ్మదీయుల మిత్రుడనని బడాయికొట్టిన వెనుకటి వైసరాయిగారు, (కర్జను) 15 వత్సరములతర్వాత ఖిలాఫతును భగ్నముచేయుటచే మనకు కలిగిన సంతాపమునుగూర్చి యేమి చెప్పెనో చూడుడు. మాంటాగూగారికి ఆయన వ్రాసినయుత్తరములో నిట్లువ్రాసెను: "ఈసందర్భమున హిందూదేశము చేసినట్టియు, చేయుట కనుమతి నొసంగబడినట్టియు సంరంభము నాకర్థమగుటలేదు. ముసల్మానుల వ్యవహారములలో, భారతదేశాభిప్రాయమా ఎల్లపుడును సిద్ధాంతము" కేంబ్రిడ్జియందు తన నియోజకవర్గము నెదుట మాంటాగూగారీ క్రిందివిధమున నుపన్యసించిరి:—

"సెవర్సు సంధియందు యిండియాప్రభుత్వము వారుకూడ పాల్గొనిరి. ఆసంధిచే శాంతియే నెలకొల్పబడినయెడల యిండియాప్రభుత్వము భక్తితో దాని ననుసరించెడిది. నేనెల్లప్పుడునుతలచినట్లుగనే శాంతిస్థాపనము కానపుడు వారుదాని మార్చుకోరిరి. తమ దేశములందునా సంధిచే శాంతికి భంగము కల్గునెడల తామూరకుందురా యని కనడా, దక్షిణ ఆఫ్రికా, ఆస్ట్రేలియా. దేశములను ప్రశ్నించుచున్నాను." ఆయధినివేశరాజ్యములందు స్వపరిపాలనము కలదనియు, తన రాజీనామా తరువాతకూడ యుద్యోగమునే పట్టుకొని వ్రేలాడుచున్న రీడింగుగారి పరిపాలనమునందున్న దేశమునకట్టి స్వపరిపాలనము లేనేలేదనియు పాపము మాంటాగూగారు మరచిరికాబోలు! ఏవిదేశప్రభుత్వము సెవర్సుసంధి సందర్భమున తన స్వల్పసిఫారసులను సంపూర్ణముగను బహిరంగముగను, తృణప్రాయముగను నిరాకరించెనో, అట్టి ప్రభుత్వము యొక్క యొత్తిడివలన, కొన్ని శతాబ్దములనుండి యశ్రుతపూర్వమగు మహానాయకుని నారు వత్సరములు కారాగృహమున నుంచిన దీయ





స్వతంత్రమగు నిండియాప్రభుత్వమే! డాక్టరు సప్రూగారుకూడ భారతదేశమునకును, అధినివేశరాజ్యములకునుగల యీభేదమును సామ్రాజ్య సమావేశ సందర్భమున మరచిపోయెను. మనవలెనే యొకప్పుడు కోరికలన్నియు నిరాకరింపబడిన యైర్లండుదేశ ప్రతినిధి సప్రూగారి కప్పుడు జ్ఞాపకము చేయవలసివచ్చెను. మాంటాగూగారు తన కేంబ్రిడ్జి యుపన్యాసమున వాదించిన దానినే మాంటాగూగారితో మనము వాదించితిమి. కాని మాంటాగూగారు దేనిని వాదించి సిమ్లామనోరథులైరో యట్టివాదనము చేసినందుల కిండియాప్రభుత్వము వారనేక విధముల శిక్షించిరి. అప్పుడు మాంటాగూగారు మనయెడల సానుభూతిని చూపుచున్నారని నాతో చెప్పిన మిత్రులు ఆసానుభూతి యిప్పుడెంత యసమర్థమైనదియు తెలిసికొనగలరు. మాంటాగూగారు బర్తరఫు చేయబడకపూర్వము కనీసమూడు మాసములు వారికి రాజీనామా నిచ్చుట కవకాశములు కలిగెనని నేననేకమారు లభిప్రాయపడితిని. నాయభిప్రాయములు నిజమనియే మాంటాగూగారి యీక్రిందివాక్యములు తెలియజేయుచున్నవి. "నేననేకమారులు రాజీనామా నియ్య ప్రయత్నించితిని. తమకు చేయబడిన పవిత్ర వాగ్దానము తృణీకరింపబడెననియు పునరావృత్తి రహితమయ్యెననియు భారతీయ ముసల్మానులకు తెలియజేయుట కిష్టములేక నేననుమానించితిని" తుట్టతుదకాయన రాజీనామా యియ్యనేయిచ్చెను. ఇప్పుడాయన ప్రభుత్వవర్గమున లేక పోవుటయేగాక కామన్సుసభలో సభ్యుడుగా కూడ లేడు. ఇంతకంటె మనయాశలను పునరావృత్తి రహితముగ కోల్పోతిమని వేరె దృష్టాంతమేల?

మిత్రులారా! వసుకత్వమున కాలము మించలేదు! భగవదనుగ్రహము చేతను మనహృదయపూర్వకైకమత్యముచేతను మనము

మనయాశయములను పూర్తిచేసి తీరుదము! లేదా తత్ప్రయత్నమున ప్రాణము వీడుదము!

ఇంగ్లాండు, లాసేనుసంధి.

వెనుక నేను చెప్పిన విషయములన్నియు 1922 సంవత్సరము నాటివి. మనయభిప్రాయములను తగినట్లాలోచింతుమని మనకు వాగ్దానము నొసంగబడెను. ఇంతలో తురుష్కులతిధైర్యముతో బ్రిటిషువాగ్దానముల సరకు గొనక తనుశక్తిపైనను భగవత్కటాక్షము పైనను నాధారపడి బ్రిటనుయొక్క నిర్ణయప్రతినిధిని గ్రీసును సముద్రమున బడవైచిరి. అప్పుడీవ్యవహారమునుగూర్చి యింగ్లాండుయొక్క యభిప్రాయ మెట్లుండెను? ఆసందర్భమంతయు నాకంటె మీకేయెక్కువగ తెలియును. అందుచే దానిగూర్చి కాలయాపన మొనరింపను. ఇంగ్లాండు యుద్ధరంగమున జయింపబడి రాజనీతియను పేరుగల కుతంత్రములచే యుద్ధఫలములను టర్కీకందకుండ చేయవలయునని ప్రయత్నించెను. ఇచ్చటకూడ స్వసాహాయ్య నిపుణులైన తురుష్కులకు విధిసాహాయ్యము సమకూరెను. లాసేనుసంధి తురుష్కులెంత రణశూరులో యుద్ధముచేయుటలో యంత రాజనీతి కోవిదులని స్పష్టీకరించెను. లాసేను సంధియెట్లు సంభవపడెనో లార్డుకర్జనుచెప్పినమాటల నాలోచింతము. టర్కీనుండి థ్రేసుదేశమును ఏషియాయందలి తురుష్కుల గృహములను కూడ దోచుకొనుడని గ్రీకుల నింగ్లీషువారుద్బోధన చేసిరి. ఒకకాలమున కాన్‌స్టాంటినోపిల్ పట్టణమును గ్రీకులస్వాధీనము చేయవలయునని ప్రయత్నించిరి. కరాచీ విచారణ తరువాత తనపుత్రులను ఫిరంగులపాలు చేయుటకు నిరాకరించిన భారతదేశమును నమ్మజాలక విజయులగు తురుష్కులపైన యుద్ధముచేయుటలో యధినివేశ రాజ్యములను సహాయము చేయుడని కోరి విఫలమనోరథులైరి. అట్లొనర్చిన బ్రిటిషు [illegible] ట్టి సూచనము కన్పట్టుచున్నదా? నేను



ర్నువంటి యొడంబడికలకును లాసేను సంధికిని యందుకారణము లందలి భేదమును కర్జనుగారీక్రింది విధమున సామ్రాజ్యసమావేశమున సెలవిచ్చినారు. "ఇదివరలో యుద్ధానంతరము చేసికొనబడిన యొడంబడికలన్నియు జయమునొందినజాతియొక్క బెదరింపులచే జరిగినవి. జయమునొందిన రాజ్యములన్నియు చేరి యపజయమునొందిన రాజ్యములు లేకుండగనే వారికి చెప్పకుండనే వారిషరతులను నిర్ణయించి వారిని శిక్షించుట యాచారమైయున్నది. అంతియు సిద్ధముచేసిన తరువాత నేరస్థునకు శిక్షను తెలియజేయుటయు వాడప్పుడు మామూలు ప్రకారముల బలబలాడుటయుకూడ నాచారము. అట్టిపరిస్థితులలో సెవర్సు సంధిషరతులు తయారుచేయబడి నిర్ణయింపబడెను. కాని టర్కీప్రతినిధులా షరతుల నొప్పుకొననేలేదు. లాసేనువందు పరిస్థితులు మతియొకలాగుండెను. అచ్చట టర్కీకూడ యన్నిరాజ్యములతో సమానప్రతిపత్తి గలిగి సంధికి గడంగెను. సంధియందలి ప్రతిషరతును వారితో చర్చించు నావశ్యకత యుండెను. కత్తిని చూపుటచేగాక చర్చచేతను వాదము చేతను, రాజీచేతను వారి నొప్పించవలసివచ్చెను"

లాసేన్ సంధిని కర్జనుప్రభువు సమర్థించెను. మిత్రమండలి యొక్క కుటిల రాజనీతిని గొనియాడెను; ప్రధానము లేమైనను అంత ప్రాణావసరములుకాని విషయములనుగూర్చి గట్టిపట్టుబట్టి సంధిసభను విచ్ఛిన్నముచేసి, మరల యుద్ధము తెచ్చిపెట్టుటకు మిత్రమండలి వారి రాజనీతి సమ్మతింపలేదని కర్జను ప్రభువుచెప్పుచున్నాడు. ఈపై యంశమునుగూర్చి విమర్శించుచు ఒకభారతీయ పత్రిక—తురుష్కుల యొక అంతసాను భూతిగలదని ప్రసిద్ధినడయుని ఒకానొకపత్రిక— యీక్రింది విధముగవ్రాసెను:—

"యుద్ధము చేయుటకు యిష్టములేని కారణమున నెమ్మదిగ, [illegible] సంధిచేసికొనుటయే [illegible] యిష్టము

ప్రశంసాపాత్రము గాజాలదు. కర్జను ప్రభు విట్లు చెప్పుచున్నాడు:—మిత్రమండలివారికి యుద్ధముచేయు కోరిక లేదని తురుష్కులకు బాగుగ తెలియును. అయినను తమలోని యతివాదులెప్పుడును యుద్ధమునకు కాలుద్రువ్వు నుద్రేకములో నుండుటచే తురుష్కులే చాలభయపడు చుండిరి. నిజముగ సంధికై యాశించు తురుష్కనాయకుల కోర్కెలు యెంతవరకు దేశములోని అతివాదుల యొక్కయు, జాతీయ వాదులయొక్కయు మన్నివార్యమగు మహోద్రేకము నాపగలవో మిత్రమండలివారికి నిశ్చయముగ తెలియదు." కర్జను ప్రభువు చెప్పిన యీవాక్యములనుబట్టి తేలిన సారాంశమేమనగ:—తురుష్కులు కేవలము శక్తిపోటుచేతనే తమకోర్కెల నెరవేర్చుకొనిరని సిద్ధించుచున్నది. లాస్సేన్ సభలో పాలకపాలితుల పదవులు తలక్రిందయ్యెను. లాస్సేన్ వద్ద సంధిషరతులను నిర్ణయించినది తురుష్కులే. వీరునిర్ణయించిన షరతులకు మిత్రమండలివారు—యుద్ధానంతర మిదివరకుజరిగిన సంధులలో పైచేయిగనున్న మిత్రమండలివారు—ఒప్పుకొనక తప్పినదికాదు. ......వేయేల లాస్సేన్‌లో కర్రత్రిప్పినవారు తురుష్కులే; మిత్రమండలివారు గొణుగుకొనుచు విధిలేక తలయొగ్గవలసివచ్చెను. చాలమంది యీసంధిని తీవ్రముగ ఆక్షేపించిరి. ఈఆక్షేపణకు సమాధానము చెప్పుచు కర్జనుప్రభు విట్లుచెప్పెను. "ఈఆక్షేపించువారు కేవల నిష్కళంక హృదయులని చెప్పుటకు వీలులేదు; అప్పటి పరిస్థితులలో యింతకంటె మంచిసంధియింకొకటి యుండజాలదు."

లాస్సేన్‌సభలో తురుష్కులు కొంతసంపాదింప గలిగిరి. ఎట్లు సంపాదింపగలిగిరి? తురుష్కులకు న్యాయము చేయుదమను మంచి బుద్ధి యింగ్లీషువారికి పుట్టుటవల్లకాదు. ఖిలాఫతు విషయమై భారతీయ ముసల్మానులకుగల గౌరవభావమును, మత విశ్వాసములను మన్నింపుదమను భావము యింగ్లీషువారికి కలుగుటవల్లకాదు. ఇది



గాక, మీదు మిక్కిలి యింగ్లీషువారికి తురుష్కులపై బహిరంగముగ ప్రబలమైన ద్వేషమున్నప్పటికిని, ఇస్లాము మత విశ్వాసములందు యింగ్లీషువారికెంత నిరాదరణ యున్నప్పటికిని—తురుష్కులు లాస్సేన్ నందు జయమొందగలిగిరని ప్రపంచమునకు మరియొకమారు తెలియవచ్చెను. లాస్సేన్‌నందు కర్జనుప్రభువు యింకొకమారు కర్రత్రిప్పెడివాడే; కాని, పాపము!—కర్ర తనచేతిలోనుండి యింకొకని చేతిలోనికి పోయెను!

నేనింతవరకు బుద్ధిపూర్వముగ, కేవలమొక్క మహమ్మదీయాశయములనుగూర్చియు, ఖండాంతరములందున్న తమసోదర మతస్థుల యెడతమకు గలసానుభూతినిగూర్చియు మాత్రమే చర్చించితిని. లాస్సేన్ సంధిసభవల్ల మనజాతీయ వ్యవహారము లన్నియు పూర్తిగ పరిష్కారముకాలేదు. భరతఖండస్థులగు సమస్తజాతుల వారికి సామాన్యధర్మముగ వర్తించు జాతీయాశయములన్నియు సంతృప్తికరముగ నెరవేరలేదు. ఇవి నెరవేరకపోవుటయేగాక, ముసల్మానులకు ప్రత్యేకముగ సంబంధించిన మతవిషయకమగు "జజరత్-ఉల్-అరబ్" కూడ యీలాస్సేన్ సంధివలన పూర్తిగ పరిష్కారముకాలేదు. కాని, యేదియెట్లున్నను, భారతీయ ప్రజలకు సమానముగ వర్తించు జాతీయాశయములే ప్రత్యేక మహమ్మదీయాశయములకంటె చాల యెక్కువగనున్నవి. లాస్సేన్ సంధివల్లగలిగిన ఫలితమంతయు ఒక్కటేగలదు:—తురుష్కులు తమస్వరాజ్యమును పోగొట్టుకొనలేదని యీసంధిసభ ప్రపంచమునకు చాటినది. నూటయాభై సంవత్సరములకు పూర్వము మనస్వరాజ్యము పోయినదని ప్రకటించితిమి. తురుష్కులుకూడ అట్లే తమ స్వరాజ్యముపోయినదని యికకొద్దిలో ప్రకటించెడివారే. కాని యీసంధిసభ వచ్చి తురుష్కులు తమస్వరాజ్యమును పోగొట్టుకొనలేదని చాటినది. ఖిలాఫతు సంఘములు కోరినషరతులును, అందు

ముఖ్యముగ "జజిరత్-ఉల్-అరబ్" నకు సంబంధించిన మతాశయములును సంతృప్తికరముగ నెరవేరక యింతవరకట్లే నిలిచియున్నవి. ఒకవేళ, యివన్నియు సంతృప్తికరముగ పరిష్కారమైనను ముసల్మానులు గవర్నమెంటుతో సహాయ నిరాకరణమును మానుకొందురా? తక్కిన భారతజాతులతో సహకారమును మానుకొందురా? మహమ్మదీయేతర సోదరులవల్ల మనఃపూర్వకముగ అంత సహాయమును పొందికూడ, మహమ్మదీయు లిప్పు డట్లుచేసినచో యింతకంటె అవాచ్యమును, సిగ్గుమాలినదియునగు మిత్రద్రోహ ముండబోదు. ఇదియొక సంగతి. ఇక రెండవసంగతి యేమనగ:—భారతీయ ముసల్మానులు తురుష్కులకును, అరబ్బులకును, స్వరాజ్యము రావలెనని ఒకమూల యెంతో యాతురపడుచు, మరియొకమూల తమసొంత స్వరాజ్యము విషయమై బొత్తుగ చూచుకొనుటయే లేదని దీనివల్ల ఋజువుకాగలదు. దీనినిబట్టి, "ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కగలదా?" యను సామెత వీరికి తప్పక వర్తించును.

—: సహాయనిరాకరణమునకు వేరొక భయంకరమగు గత్యంతరము :—

మిత్రులారా! మీకు మరల చాలశ్రమ నిచ్చుచున్నానుగా బోలు. అయినను దీనికొక కారణమువచ్చినది. అందుకు నన్ను మన్నింతురుగాక. ముసల్మానులు యింగ్లండుతో సహాయనిరాకరణము మానుకొనవలసినదని కొందరు చెప్పుచున్నారు. కాని, వారికి నేను చెప్పునదేమనగ:—

మనమిదివరకు యింగ్లండుతో చేసిన సహకారమువల్ల కలిగిన విషాదానుభవములయొక్క ఫలితముగ మనమిక వారితో సహకారము చేయకూడదని విధిలేక నిర్ణయించుకొంటిమి. మనమిప్పుడిట్టి నిశ్చయమునుండి మరలుటకు పూర్వము నిజపరిస్థితుల నొకసారి పరికించిచూ-



చుడని కోరుచున్నాను. బ్రిటిషు సామ్రాజ్యమందు భారతదేశముకూడ యింగ్లండు అధినివేశములతోబాటు సరిసమానమగు భాగస్వామిగా నంతవరకు—భారతరాజ్యము ఆరువేల మైళ్ళదూరమందున్న బ్రిటిషు గవర్నమెంటుకు లోబడి దానికి ఉపాంగమై యున్నంతవరకు—యిండియా గవర్నమెంటువారు చాలమంచివారని సంపూర్తిగ ఋజువుచేసినను మేముమాత్రము వారి దయాదాక్షిణ్యములతో సంతృప్తిచెందజాలమను మాట నిశ్చయము; ముమ్మాటికి నిశ్చయము. పరప్రభుత్వమునకు భక్తిజూపుటయేగాక, మానవుడు భక్తిచూపవలసిన విషయములింకను పెక్కులుగలవు. భారతీయ ముసల్మానులు తమదైవమునను, తమతుదిప్రవక్తకును భక్తిజూపిరను కారణముచే వారిగవర్నమెంటునకు ద్రోహముచేసిరను నెపమున—మమ్ములను కరాచీలో శిక్షించినట్లు—శిక్షించుచున్నంతవరకు—మాతుదిప్రవక్తతన నిర్యాణకాలమందు మాకు విధించిన భగవన్నియమమునకు విరుద్ధముగ మా యిస్లాము పుణ్యభూములు మహమ్మదీయేతరుల చేతులలోనున్నంతవరకు—దౌర్జన్యరహిత సహాయనిరాకరణముగాక, మాకింక మరియొక్కటే గత్యంతరముకలదు. మిత్రులారా! ఆభయంకరమగు గత్యంతరము యుద్ధమొక్కటే! మనపద్ధతిని నిరసించువారిలో చాలమంది గవర్నమెంటునిన భయపడి చప్పుడానిసలేరై యున్నారు. అదిగాక యేమాత్రము త్యాగముకూడ చేయుట కిష్టపడని వారగుటచే, వారా భయంకరమగు గత్యంతరమునుగూర్చి కలలోనైన తలంపజాలరు. కావున మనపద్ధతులను మార్చుకొనవలెననుమాట మనచెవికి సోకనీయకుడు.

—: మహమ్మదీయేతరులతో మహమ్మదీయుల సహకారము :—

ఇంగ్లండుతో సహకారము చేయకపోయినచో, యికమనమహ-

మ్మదీయేతరులతోకూడ సహకారము చేయ నవసరములేదని యర్థమగునా? హిందూమతమందు గాఢమగుభక్తిగల ఆగాంధిమహాత్ముడు యిస్లాముమతమునకై పాటుబడుటవల్ల జైలునకు పోయెను. ఆమహాత్ముడట్లు జైలునకు పోయినపిమ్మట అట్టివాని తోడిమతస్థులతో మనమిప్పుడు సహకారము మానుకొనవలసినంత అవసరమేమి గలిగెను. హిందూముసల్మానుల కిప్పుడున్న సంబంధము సరిగ రెండుసంవత్సరములక్రింద నున్నట్లు లేదని నాకు తెలియును. ఏఒక్కజాతిగాని కేవలము నిర్దోషియనియు, తప్పంతయు రెండవజాతిదే యనియు నిజమగు దేశభక్తుడెవడైన చెప్పగలడా? మిత్రులారా! కుతంత్రమునందు నాకునమ్మకములేదు; అందులో రహస్య కుతంత్రములందునాకు బొత్తిగనమ్మకములేదు. కాని కేవలము "ఉభయత్రదోషమున్నద"ను మాటను మాత్రముచెప్పి యీసమస్యను త్రోసివేయుటకు నేను యిష్టపడను. మలబారు, ముల్తాను, ఆగ్రా, సహరన్‌పూరు మున్నగు ప్రదేశములలో మన దురదృష్టవశమున మహాసంతాపకరములగు ఘోరకృత్యములు జరిగెను. ఈయుభయజాతులలో నెవరియందే దోషమున్నదో కనుగొనుటకై జాతీయపంచాయితీ నొకదానిని నిర్మించుటకు నేనుపూర్తిగ సమ్మతింతును. ఈఘోరకృత్యములవల్ల నెక్కువగ బాధనొందిన జాతివారుమాత్రమేగాక తదితర జాతివారుకూడ బాధనొందినట్లు వారే ఒప్పుకొందురు. తామేతప్ప తక్కినజాతివారు బాధనొందలేదని ఎవరును (బాగా బాధనొందినవారు కూడ) చెప్పజాలరు. కాబట్టి సరియైన విచారణలేకుండ నేరమునంతను ఒక్కజాతి నెత్తిమీదనే వేసి, దానినే నిందించినందువల్ల ఫలితమేమియునుండదు. అదిన్యాయముకూడ కాదు. ఉభయసంఘములనుండి సరియైన ప్రాతినిధ్యముతో నొకవిచారణసంఘము నేర్పరుచుటకు నేను ఢిల్లీలో నెంతమాత్రమును వెనుదీయలేదు. కాని యిట్టివిచారణసంఘమువల్ల సరి



యైన ఫలితమెప్పుడును యింతవరకు లభించియుండలేదు. దానికి కారణముల నేనిట వివరించుట అనవసరము. ఏదియెట్లున్నను, మనకు రెండుసంగతులు మాత్రము స్పష్టముగ గన్పట్టుచున్నవి. ఈ ఉభయసంఘములలో దోషమెవరిదని మనమిచ్చట విచారించుచుండగ గవర్నమెంటు కోర్టులు ఊరకుండవు; వానిపనుల నవిచేయుచునే యుండును. గవర్నమెంటు కోర్టులలో ప్రమాణముమీద నిజమో, అబద్ధమో సాక్ష్యమిచ్చివేసిన పిమ్మట మనజాతీయ విచారణ సంఘమువల్ల నిజమును తేల్చుట చాలకష్టమగును. అదిగాక గవర్నమెంటుకోర్టులలో సాధారణముగా అనుమాన రహితమని చెప్పుటకు వీలులేని యేసాక్ష్యాధారమువల్లనో— కొందరు దోషులుగ నెంచబడి శిక్షింపబడిన పిమ్మట ఉభయసంఘములకును సమాధానము కుదుర్చుట బహుకష్టమగును; ఏలననగ:—తప్పెవరిదో కనుగొనుటకంటె కూడ ఉభయసంఘములకును పొత్తుకలుపుటయే చాల అవసరమై యున్నది.

—:దివ్యౌషధము:—

ఇక కర్తవ్యమేమి? ఒకపక్షము యొక్క వాదమునుమాత్రమే యొప్పుకొనుట సమంజసముకాదు. మరియు నట్లుచేయుట, నెవరి పక్షము విచారణయేలేక నిరాకరించిరిమో వారియందు రాజీకిని మార్పునకును కావలసిన మనోధర్మమును కుదుర్పజాలము. వెంటనే యాచరింపవలయునని నేను నొక్కిచెప్పుచున్న ప్రతీకారము అన్నిటికంటె కార్యకారి. మరియు నీవిషయమును ఢిల్లీయందుకూడిన యుప సంఘము చర్చించునపుడీపద్ధతినే సిఫారసుచేసిరి. హిందూమహమ్మదీయ వైషమ్యముల పరిణామములుగా నెచ్చటెచ్చట యల్లరులు జరిగెనో యచ్చటికెల్ల వెళ్లివిచారణచేయుటకొకయుపసంఘమేర్పరుపబడి,యందున సభ్యులుకూడ నిర్ధారణమైనతరువాత, కొంతచర్చ జరిగినపిమ్మట అందు నాయకుల భావములలో మంచిమార్పు కొంత కలుగుటచే, నీపద్ధతి

వంతను రద్దుపరచుటకు సిద్ధమైతిమి. రెండువత్సరములకు పూర్వముచేసినట్లు వెనుక జరిగిన విషయముల మరచి పరస్పరము హృదయపూర్వక సహాయముచేసికొని స్వరాజ్యము సంపాదింపవలెనను నుద్దేశము జనించెను. మహాత్ముడట్టి యైక్యతను బోధించి యాచరించెనో యా యైక్యదేవతా దర్శనభాగ్యము మరల నిరుపక్షముల నాయకులను పొందగలిగిరి. పక్షజయముల నొందుట నీచమనియు, మరలతోచెను. కాని యొకస్వల్పకారణముచే భేదముద్భవిల్లి రెండుసంఘములును విడిపోయెను. సోదరులారా! ఐక్యదేవతా పునర్దర్శనము లభించునట్లును, యీమారు తద్దేవతాకటాక్షము వెనుకటివలె తాత్కాలికముగాకుండునట్లును, భగవంతు డనుగ్రహించుగాక! అంతియెగాదు! జాతీయైక్యతామూలమునకలుగు స్వాతంత్ర్య దర్శనములును, తదైక్యమును, మనశ్చక్షుస్సునకు నెదుట కనపడుగాక! అట్టియైక్యతకుముందు దాస్యసంబంధముగల్గి సుఖముగ గన్పట్టు సర్వము అనుమానాసౌందర్యములను వీడి శాశ్వతనాశమును పొందగలదు.

—: ద్వేషకారణముల తుచ్ఛత్వము :—

అట్టి ప్రాముఖ్య విషయములు అలంకారయుక్తమగు వాగాడంబరముల వలన పరిష్కరింపబడవని నమ్ముదు. హిందూ మహమ్మదీయ సమస్య,అత్యంత—అత్యంతయేకాదు—ప్రాణావసరమైనసమస్యయైనను, హిందూ మహమ్మదీయ యైక్యతకు భంగము కలిగించు కారణములు మిక్కిలి తుచ్ఛములు. అన్నిటికంటె యీకారణముల తుచ్ఛత్వమునకే నేనుసిగ్గుపడుచుంటిని. ఈకారణములెంత తుచ్ఛములైనను, వాని వలనకలుగుచున్న అనర్థముల దలంచినప్పుడు సంపూర్ణబాధ్యతాయుత స్వపరిపాలనమునకు మనకర్హతలేదని మనశత్రువులు మనపైమోపు యపవాదములకు, సమాధానముచెప్పజాలకున్నాము. నాసోదర మానవుల ఆరాధనాపద్ధతుల నెన్నండును, పరిహసించు వాడనుగాను-



రాజవీధిలోనికి వంగియున్న రావికొమ్మనునరికి, యొకగజము త్రోవ నాక్రమించినందువలన గలిగినట్టిగాని, ప్రార్థనలు జరుగుచుండగా ప్రార్థనాలయముల యెదుట (మసీదులయెదుట) మృదంగములును, తప్పెట్లును మున్నగువానిని వాయించుటవలనగలిగినట్టిగాని,యల్పసంతుష్టికై, మతరాజకీయ సంపాదనాప్రయత్నముల భగ్నమొనర్చు సోదరదేశీయులును స్వమతస్థులును గలరని దలంచినపుడు నేను మిగుల దిగులుబడుచుండును. మంచి చెడుగుల గుర్తింపలేక, యింత యవివేకశూన్యులమైతిమేని, మర్మమువిడచి యట్లే యొప్పుకొందము. స్వాతంత్ర్యముమాట నిక దలంపకుందము. సామ్రాజ్యబహిర్గత స్వరాజ్యముమాట యటుండనిచ్చి, సామ్రాజ్యాంతర్గత స్వరాజ్యము మాటనైన దలంపవలదు. రావియాకును మనవంటి వానిసలకును సంబంధమేమి? మనకును కెవివాకును సంబాధమేమి? వాని గుఱ్ఱపుసాలలో స్థానమునకైన నర్హత లేనప్పుడు సార్వభౌముని ప్రాసాదమున స్థానమునకై పెనుగులాడనేల? మహమ్మదీయ పవిత్రక్షేత్రము బహిరంగ నటనాశాలలకును, విలాసమందిరములకును, నిలయమైన మనకేల? మహమ్మదీయ పవిత్రస్థానములన్నిటికెల్ల మహాపవిత్రమైన మెక్కాపుణ్యభూమిని బలి రక్షింపనేర్పడిన నూతన పాలకుడు సామ్రాజ్య దొరతనముచే పోషింపబడుచు దుర్బలుడై, సామ్రాజ్యప్రదర్శనములోని యాటబొమ్మగాగాక, భగవానుడు దన్నుమానవునిగా సృజియించెనను మాట నెరుగగక, తన్ను దామరచినప్పుడు తన పూర్వీకుల సింహాసనమునుండి ద్రోసివేయబడి, పదభ్రష్టుడైన మనకేమి? ఆమలకాశ్వత్థ వృక్షములును వాయిద్యములతో గూడిన యుత్సవములునుదప్ప యన్యములు మనదృష్టికి గాన్పింపని యెడల మన కాంగ్రెసుసభలును, ఖిలాఫతు సభలును, కేవలము హాస్యాస్పదములు. "ఇంక విరమింతము, హాస్యప్రదర్శనముల వలన ప్రయోజనములేదు." బాల్యచేష్టలకింక స్వస్తిజెప్పెదము. తక్షణ

మే వెనుకకుమరలి, మనభాగును మనము గుర్తించుకొనుటకై యింతటనుండియు బాటుపడెదము. బానిసజాతికదియే చేయదగిన పని. స్వాతంత్ర్యనామమును వృథాగా కళంకభూయిష్ట మొనర్పవద్దు. మనయొప్పుదలచే మనవైరులు జెప్పినమాటలనే బలపరచెదము. ప్రాచ్యమత ప్రవక్త లెవ్వనిగూర్చి పక్షపాతరహితులై మనకు ద్బోధించియుండిరో, అట్టి భగవానుడు, మనల స్వపరిపాలన కనర్హులజేసి, ఐరోపఖండమున వసియించు శ్వేతముఖులకే యట్టియర్హతయొసంగి, భారతవర్ష పరిపాలనము ఆచంద్రార్కము వారలకే పట్టముగట్టి, మానవకోటిలో నైదనవంతు ప్రజల కన్యాయముజేసెనని యొప్పుకొందము. ఆధ్యాత్మిక పరులగు, మనపూర్వీకులగూడ నపకీర్తిపాలు గావింపనిచ్చగింపమేని, పక్షపాతరహితుడగు భగవానుని దూషింపనిచ్చగింపమేని, మన యాదర్శముల సఫలమొనర్చుటకై పరివర్తన మొందెదము. ప్రజాసంతతుల నపుగంటజేయక నుద్ధరింతము.

—:ద్వేషమూలము:—

జనసామాన్యముయొక్క హీనస్థితినిగూర్చి చెప్పితినిగాన, వారినిగూర్చి యింకొకమాటకూడ చెప్పవలసియున్నది. గవర్నమెంటు విశ్వవిద్యాలయములలో నొసంగబడువిద్యను విమర్శించుచు నేను 1904 సం॥లో వ్రాసినవ్రాతలు యిప్పటికిని నిజముగనే యున్నవి. ఈరోజునకూడ "మూఢత్వమనునది అల్ప విద్యావంతులనే మదోన్మత్తుల జేయుచున్నదిగాని అమాయికులును, విద్యావిహీనులునగు జనసామాన్యమును కాదు" మనమతమందుండు అభిమానముచేగాదు మనము పరమతస్థులతో కలహించుట. మనలోనుండు స్వాతిశయము, తుచ్ఛస్వార్థము వల్లనే మనమిట్లు కలహించుచున్నాము. మహాత్ముని యాగమనమువల్ల యీచిన్నచిన్న "రాజ్యము" లన్నియు నశించినవి. అంతయు యేకముగ ఒక్కటే అఖండమగు "రాజ్య" ము స్థాపింపబడెను. ఈఅఖండ రాజ్యమునకు



ప్రధానసేవకుడుగనుండుకీర్తి ఆమహాత్మునకబ్బెను. కాని తమసింహాసనముల గోల్పోయిన యీపిల్ల "రాజులు" ఒక్క అఖండమగు జాతీయపతాకముక్రింద దేశసేవ చేయుదమను బుద్ధివీరికి గట్టిగ కలుగలేదు; అంగ చేవారు లోలోపల గొణుగుకొనుచునే యుండిరి. కానిమహాత్ముడును వారిప్రధాన అనుచరులును, బయటవున్నంతకాలము యీచిల్లరరాజులు తిరుగుబాటుచేయుటకు ధైర్యములేక ఊరకుండిరి. వారికి భారతదేశమందు రెండే గత్యంతరములుండెను. పరరాజులకు బానిసలై ప్రజలచే బహిరంగముగ చీవాట్లునను తినవలెను; లేదా లోలోన గొణుకుకొనుచు మెదలకుండ జాతీయోద్యమ ముద్దైన యుండవలెను. కాబట్టివారు వీనిలో రెండవదానినే యవలంబించిరి. కాని, మహాత్ముడు ఎరవాడజైలునకు పోగానే, వీరుమరల తలలెత్తిరి. కాని, ఆయున్నతస్థాన మలంకరించుటకు వీరికి సమర్థత లేకపోవుటచే, వీరు జాతీయోద్యమమును నాశనముచేసి తమతమ "చిన్నరాజ్యముల"ను తిరిగి స్థాపించుకొనుటకయి సీరుశాఖాభిమానములను, యీర్ష్యలను నిరంతరము—బహిరంగముగ కాకపోయినను—పరోక్షముగనయిన పురికొల్పిరి. మహాత్ముని యాగమనమునకు పూర్వము అనేక పిల్లకాలువలు—కొన్ని చిన్నవి, కొన్నిపెద్దవి—దాదాపు ఒక్కేదిశకు ప్రవహించుచుండెను; యీకాలవలలో చిన్నపడవలు నడచుచుండెను. కాని మహాత్ముడు రాగానే, యివన్నియు యేకమై ఒక్కమహానదియై గంభీరధ్వానముతో సాగర సంగమ మొనర్చుటకయి ప్రవహించుచుండెను. ఈపిల్లకాలువలన్నియు ఆమహానదికి ఉపనదులయ్యెను. విశాలమగు యీ గంగాప్రవాహముపై బలిష్టమగు నౌకయొకటి నడచుచుండెను. ఈనౌకను ఉత్సాహవంతులగు నావికులు నడుపుచుండిరి; ఈ నావికులకందరకును మహాత్ముడు నాయకుడుగ నుండెను. ఈనావపై జాతీయపతాక మెగురుచుండెను. మహాత్ముడు జైలునకు పోయినతరువాత

అల్ప మానవులగు వారికి గలిగిన అల్పబుద్ధి యేమనగా:- ఈ పెద్దనావను తీసివేసి, చిన్నచిన్న పడవలను వేయవలెనని వీరు సంకల్పించిరి. కాని మహాగంభీరధ్వానముతో సాగరసంగమ మొనర్పబోవు యీ మహానది యురవడికి యీ చిన్ని పడవలు నిలువనేరవు. కావున వారు యీ ప్రకృతినే తలక్రిందు చేయదలచిరి. అనగ, యీ మహానది చీలి వెనుకకు పోయి, చిన్నచిన్న పిల్లకాలువలుగ ప్రవహింపవలెనని వీరాజ్ఞాపించిరి. కాని, ప్రకృతిని వీరు నిరోధింపజాలరు. గంగాప్రవాహమును వెనుకకు మరల్పదలచుట నిష్ప్రయోజనమని యెంతటి మూర్ఖునకైనను తెలియును. ఈ కాంగ్రెసు మహాసభ పేరిటను, భారతజాతియంతటి పేరిటను, వేయేల సర్వనియామకుడగు ఆ భగవానుని పేరిటను, నేనీ యల్పాశయులగు వారికి హెచ్చరించి చెప్పునదేమనగ:- మీరెంత తన్నుకులాడినను మీరు జయించలేరు. మీరు పన్ను కుతంత్రములను భారతజాతి యుపేక్షింపజాలదని యెఱుంగుదురుగాక.

సహనము, భ్రాతృవాత్సల్యపూరితమగు ఆత్మార్పణము.

మిత్రులారా! రాచకీయరంగమునుకూడ నేనిప్పుడు చర్చించుట నిరుపయోగముకాదు. కాని రాచకీయవిభేదములకు నేనిదివరకు చెప్పినట్లు ఒక్కటే తిరుగులేని మందుకలదు. అందరుకూడ గతంనాస్తి యనుకొని వెనుకటిదాని నంతను మరచిపోయి ఒకరినొకరు మన్నించుకొనవలెను. అందరిలోను యిట్టిభావము పుట్టునట్లుచేయుటయే దీనికి తగినమందు. కాని, ఇది ఒక్కటియే చాలదు; సంతాపకరమగు నిట్టి యకృత్యములికమీద జరుగకుండ వారింపవలెనన్నచో కలహకారణములను తొలగింపవలెను. అన్నివిషయములలోను సదా ఒకరీతిగ నుండవలెనని మనము తరుచుగ పట్టుబట్టుచుందుము. ఇట్లుపట్టుబట్టువారు ఒక్కపాఠ[illegible]లేగాదు; విశాలహృదయులగు నా[illegible] కూడ చాలమంది యిట్లేపట్టుబట్టుదురు. దేశములో [illegible] సిద్ధాంతముల-



నన్నిటిని కలిపి ఒక్కముద్దగ చేసిపెట్టవలెనని మతసంస్కర్తలు యత్నించిరి. కాని యిదిచాల అపాయకరమైనసంగతి. అదేమోగాని ప్రతిమతసంస్కర్తయు నిట్లేచేసెను. అన్నిమతములలో నుండియు కొంచెము కొంచెముగ తీసికొని ఒకచోటచేర్చి దానినికలిపి ఒకక్రొత్తమతముగచేసినచో యిది అందరికిని సమ్మతముగ నుండునని వారు తలచిరి. ఈరీతిగ ఐకమత్యము, సమానత్వము సిద్ధించునని వారూహించిరి. కానిసర్వమతముల నిముడ్చుకొనగల యిట్టిమెత్తని మతమువల్ల ప్రపంచమంతయు శాంతియు ఐకమత్యమును పొందినట్లు చరిత్రయందెచ్చటను లేదు. మీదు మిక్కిలి యిదివరకు కలహించుచున్న మతములలో నిదికూడ యింకొకటికాజొచ్చెను. అందుమూలమున యిదివరకున్న విభేదములు మరింత యెక్కువయ్యెను. సదుద్దేశములతో ప్రారంభింపబడిన యీమత సంస్కరణములిట్లు నిష్ఫలములగుటవల్ల తుదకు ప్రజలు గత్యంతరములేక పరమతసహనము నేర్చుకొనక తప్పినదికాదు. సహనమనగ ఉపేక్షకాదు; దృఢవిశ్వాసము లేకపోవుటకాదు. స్వమతమునందు మనకున్న గాఢవిశ్వాసముతోపాటు మనజీవితమందిదికూడ యొక గట్టితత్వమైయున్నది. కేవలముపరస్పర విరుద్ధాభిప్రాయములుగల తనతోడి దేశీయునితో ఒకానొక అమెరికనుదేశస్థుడు చెప్పినమాటలకంటె నేనీవిషయమై యెక్కువగ విప్పిచెప్పజాలను. ఆతడుచెప్పినమాటలివి.

"నీవు చెప్పిన ప్రతిఅక్షరముతో నేను తీవ్రముగ వ్యతిరేకించుచున్నాను. కాని, నీకామాటలు చెప్పుటకు సంపూర్ణమైనహక్కు గలదని నేను వాదింతును; అట్టి నీహక్కును నిలువబెట్టుటకై నాశరీరముతో నెత్తురుచుక్క ఉన్నంతవరకు పోరాడితీరుదును." మిత్రులారా! ఇది! నిజమైన సహనమనగ యిది! మతస్వాతంత్ర్యమున కెప్పుడైన భంగము కలిగినచో, తద్రక్షణార్థమై మనప్రాణములు [illegible] వీర[illegible]వలెనా? [illegible] కోరరాదు [illegible] సహ[illegible] [illegible]

చెప్పుచున్నది:-"నీకు నీమతము, నాకు నామతము." మనమీ సూత్రముపై నడచుట కంగీకరించుచు, అన్నిమతములకు సామాన్యధర్మములుగ నుండువానిని సదా యెత్తిచెప్పుచు, అన్నిమతములకు వర్తించు ఆధ్యాత్మిక సంపత్తిని గ్రహించుచు, మనము వ్యవహరించినచో యీ లోకమందు కలహమేయుండదు; ఎల్లెడలను శాంతియు, హాయియు, రాజ్యము చేయును.

—♦ ఈతత్వమును ప్రస్తుతపరిస్థితులకు వర్తింపజేయుట. ♦—

నేడు భారతవర్షమందు నానాజాతుల మధ్యనున్న పరిస్థితులకీ సూత్రమును వర్తింపజేసి చూతము.

ఉదాహరణ :—పబ్లికు రోడ్ల వెంట మేళతాళములతో ఉత్సవముచేసికొనుటకువీలున్నప్పుడు,—ఉచితరీతిని దైవారాధన మొనర్చుకొనుటలో నగు తన సహజహక్కునకు భంగము కలుగనంతవరకు ముసల్మానులెవరును హిందువులయొక్కగాని, తదితరమహమ్మదీయేతరులయొక్కగాని ఉత్సవములను అడ్డగింపరాదు. ప్రాణమునకుగాని, శరీరమునకుగాని హానిలేకుండ పొడుగుపాటి కర్రను ఎత్తుగ వీధులవెంట ఉత్సవముతో తీసుకొనిపోవుటకు వీలున్నప్పుడు, మహమ్మదీయేతరులెవరును అట్టియుత్సవమును అడ్డగింపరాదు.

యీయుత్సవములు శాస్త్రసమ్మతములగునో కావో సందేహాస్పదము. అయినను యిట్టియుత్సవములు చేసికొనుచుండగ మధ్యత్రోవలో నడ్డమువచ్చిన చెట్టుకొమ్మలను కొట్టివేయుటకు దానియజమానుడంగీకరించి తీరవలెనని యుత్సవముచేసికొనుచున్న మహమ్మదీయులు పట్టుబట్టుట కెట్టిహక్కునులేదు. అందుముఖ్యముగ ఆచెట్టు అతనిస్థలములో నుండి అతని సొంతఆస్థి అయినప్పుడును, ఆతడుదానిని పూజ్యభావముతో చూచుకొనుచున్నప్పుడును, మహమ్మదీయులట్లు పట్టుబట్టుట కెట్టిహక్కును లేదు. ఆచెట్టు నందాతనికి పూజ్యభావమేర్పడుట



సహేతుకమో, నిర్హేతుకమో మనము చర్చింపనవసరములేదు. అది మనపనికాదు. పారశీకులు అగ్నిని పవిత్రమైన దానినిగ నెంచి పూజింతురుగాక. పూజ్యమైన యీయగ్నిహోత్రముతో చుట్టనుగాల్చి దాని నపవిత్ర మొనర్పరాదని పారశీకులు తలంతురుగాక. అయినను, బహిరంగప్రదేశములలో చుట్టకాల్చకూడదనుచట్టము లేనంతవరకు పారశీకేతరులు వీధులలో చుట్టకాల్చకూడదని పారశీకులు నిర్బంధించరాదు. అదే రీతిగ, జంతువులను చంపుట చట్టవిరుద్ధము కానంతవరకు, తనతిండికొరకో, యితరులకొరకో, బలియర్పణములకొరకో, ప్రత్యేక మాజంతువునెడ క్రౌర్యమును ప్రకటించువిధమునగాక సామాన్యరీతిగ నెవడైన కోడినో, ఆవునో, పందినో, తదితరజంతువునో చంపినప్పుడు పొరుగింటివాడు వచ్చి తానది సహింపజాలననియు, యేప్రాణియు చంపబడగూడదనియు, తాను గోవును తల్లితో సమానముగ జూచుకొనుచుననియు, అసహ్యకరమగు పందిమాంసమును తినుట తనకు గిట్టదనియు, తన మతరీత్యా జంతువుల నింకొక రీతిగ చంపవలసి యుండుననియు, లోనుగాగల కారణములచే అభ్యంతర పెట్టకూడదు. కాని, యీసందర్భమందు మన మింకొక విషయమును మాత్రము గుర్తింపవలెను. ఆ చంపబడు జంతువు ఆచంపువానిదే యైయుండవలెనుగాని, తన పొరుగింటివానినుండి బలాత్కారముగ లాగికొనినది కాకూడదు. కాని నాహక్కును నేను స్వేచ్ఛగ వినియోగించుకొనుచుండగ, దానినిచూచి రెండవవాడు సహింపగలస్థితి—అయ్యో!—మనదేశమున కింకను రాలేదు. పైపెచ్చు మనలో చాలమంది "యిది నాహక్కు" అని చెప్పుచు తమ పొరుగువారికి యిబ్బంది కలుగజేయుదమనుసంకల్పముతోనే వారాహక్కును వినియోగించుచున్నారు; తప్పక పొరుగువారికి యిబ్బంది కలుగజేయు విధముగనే వారాహక్కును వినియోగించుచున్నారు. మత నిబంధనలందు చెప్పబడినరీతిగ యోగ్యమైన ఉత్స[illegible] చేసికొను

చుండగ తదితర మతస్థులు దానిని చూచి వెక్కిరించుటయు, కొందరు తమ ఉపాసనామందిరములలో ప్రార్థనలు చేసికొనుచుండగనో, లేక యేమతకర్మ జరుగుచుండగనో, యితరులువచ్చి డప్పులతోడను, తదితర జంత్రములతోడను చక్కనిసంగీతముగాక బుద్ధిపూర్వకముగ వికారణా కారణధ్వనిచేయుచు లోపల జరుగు కర్మకు భంగము కలిగించుటయు, హిందువులకు పవిత్రములగు చెట్లకొమ్మలను వీధపై వ్రేలాడుచున్న వానిని, నిర్హేతుకముగ కొట్టివేయుటయు; అందు ముఖ్యముగ కేకింతలు కొట్టుచు నరికివేయుటయు; చుట్టపొగను పారశీకుని మొగము మీదగాని, శిక్కు మొగముమీదగాని వదలుటయు; అల్లరికొరకు జైనుల కెదురుగ అనేక ప్రాణికోట్లను చంపుటయు; ఆవునకు మెడలో పూలదండలు వేసి హిందువులున్న వీధులగుండ ఊరేగించి కసాయిదుకాణము నకు తీసికొనిపోవుటయు; లేక హిందువులు చూడకుండ తప్పించుకొన లేని ప్రదేశములలో గోవులను చంపుటయు;—మొదలుగాగల అనేక దుష్కృత్యములు సంఘములమధ్య పట్టుదలలు ప్రబలినపుడు తరుచుగ జరుగుచుండును. ఇట్లు క్రోధము రగుల్కొను పనులు చేయుటచేతను, పొగరుబోతుతనముగ యితరులనుజూచి కేకింతలు గొట్టుటచేతను పరుష భాషణములు బయల్వెడలును. దానిమీద చేతులుకలిసి గుద్దులాటలోనికి దిగుదురు. దీనివల్ల తరుచుగ ప్రాణనష్టముకూడ సంభవించును.

### వీనితో నెగ్గుటెట్లు ?

ఇటువంటి విషయముల నన్నిటిని సమగ్రముగ పరిష్కరించి శాంతిని గాపాడగల సమర్థమైన చట్టమొక్కటియు గానరాదు. వీని నన్నిటిని పూర్తిగ నివారించగల "జాతీయపు టొడంబడిక" నాకేదియు గానరాకున్నది. ఇతరప్రపంచముజూచి మనలను నవ్వినను సరేయను కాని ప్రతిచిన్న వివరమును, ప్రతిచిల్లరతగాయిదాను ఒక్కదాని [illegible] యిరికించి, పెద్దభారతముగ చేయువమ



న్నను నాకట్టి "యొడంబడిక" యేదియు గన్పట్టకున్నది. కాబట్టి దీనికి నాకొక్కటే మంచిమందు గన్పట్టుచున్నది. ఎవరి హక్కులను వారు చక్కగ వినియోగించుకొనుటకు తగిన సరియైన వాతావరణమును కల్పింపవలెనని నేను మరల నొక్కిచెప్పుచున్నాను. ప్రధానమగు కలహకారణములను గుర్తించి, ఆయాసంఘములకు చెందిన నాయకుల నొక సమాధానమునకు రప్పించి, ఆకలహకారణముల తొలగింపజేయవలెను. ఈపని నిర్వహించుటకు కాంగ్రెసువంటి జాతీయసంస్థకు సాధ్యముకాగలదు. ఈపనిని కాంగ్రెసుచేసి తీరవలెను. కాంగ్రెసు మహాసభ యిట్టినాయకులద్వారా ప్రజాభిప్రాయమును చక్కగ తన వైపునకు త్రిప్పుకొనుచు, ప్రజలలో నెట్టియకృత్యములు జరుగకుండ జాగ్రతగ కాపాడుకొనుచు, ధైర్యమును ఆత్మవిశ్వాసమును గోల్పోవకుండ నుండవలెను. మరియు యింకొక విషయములో కూడ కడుజాగరూకతగ నుండవలెను; ఏసంఘమునుగాని తనహక్కులను వదలుకొనుమని కోరకూడదు. ఇప్పటి పరిస్థితులలో యిట్లు చేసినచో, అది తనకు మించిన త్యాగము కావచ్చును. స్వరాజ్యమే మనయాదర్శము; అది కొద్దిలో మనకు లభింపగలదు; అయినను దానిని మనమింకను పొందవలసి యున్నామనుమాటనుమాత్రము మరచిపోకూడదు. స్వరాజ్యము మనకు పూర్తిగ హస్తగతమగువరకు, గవర్నమెంటువలె ప్రజలను నిర్బంధించుటకు మనకేమియు అధికారముద్రలేదు. మనము కేవలము ప్రజలను ఒప్పించుకొనుటచేతను, ప్రోత్సహించుటచేతను, మనము స్వయముగ చేసిచూపించుటచేతను మాత్రమే ప్రజలచేత పనులను చేయించవలసి యున్నది. రేపు మనకు స్వరాజ్యము వచ్చినప్పుడుకూడ, వారికి తగిన ప్రతిఫలము చూపకుండ తమహక్కులు వదలుకొనితీరవలెనని గొప్పగొప్ప ప్రజాసంఘములను మనము జయప్రదముగ నిర్బంధింపజాలము. అట్లు నిర్బంధించుట న్యాయముకూడ కాదు.

—:గో-హత్య:—

ప్రస్తుతము విచారణీయాంశములలో గోహత్య యొకటి. నాహిందూసోదరుల దృష్టిలో గోవు యెంతపవిత్రమైనదో నేనెరుగుదును. గోవును రక్షించుటకై మానాయకు డెంత తాపత్రయపడెనో నాకంటెను నాసోదరునికంటెను యెక్కువగ తెలిసిన వారెవ్వరైననున్నారా? అంతటి స్వార్థరహితబుద్ధితో ఖిలాఫతు ఉద్యమమును నడిపించిన మానాయకుని మహోదారబుద్ధి కేవలము అతీతమైనది. తాను ముసల్మానుల గోవును—అనగ ఖిలాఫతును—సంరక్షింప నడుముకట్టితినని ఆమహాత్ముడే చెప్పుచుండెడివాడు. తానట్లుచేసినచో, దానికి ప్రతిఫలముగ మహమ్మదీయులు తనగోవును సంరక్షింప నుద్యుక్తులగుదురని యాతడుద్దేశించెను. దయకు ప్రతిఫలము దయయేగాక వేరొండులేదని తమ మతగ్రంథములనుండి నేర్చుకొనిన మహమ్మదీయులు తానుచేసినదానికి ప్రతిఫలముగ తనగోవును సంరక్షింప బూనుదురని ఆమహాత్ము డాశించెను. గోవునందు మహాత్మునకున్న ప్రేమను యీరీతిగ వ్యక్తపరచెను. ఖిలాఫతు మహమ్మదీయులకు గోవని మహాత్ముడు మనోహరరీతిగ వర్ణింపకముందే మాయిరువుర సోదరుల మెన్నడును గోవును చంపకూడదని శపథముచేసికొంటిమి. అప్పటినుంచి మాయింటిలో నౌకరులుకూడ గోమాంసమును తినుటమాని వేసిరి. మాతోడి మతస్థులనుకూడ యిట్లుచేయుడని ప్రోత్సహించుట మావిధిగ పెట్టుకొంటిమి. నేనుగాని, మాఅన్నగారుగాని యెన్నడును గోవును వధింపలేదు. కాని, మేకలను బలియిచ్చితిమి; యేదో యొక జంతువును బలియిచ్చుట మామత విధమైయున్నది. ఈరీతిగ మనము చాలవరకు పనిచేయవచ్చును. హిందూమహమ్మదీ యైక్యతయేర్పడిన యీమూడునాలుగు సంవత్సరముల యనుభవమునుబట్టి స్వరాజ



ముగాకముందే గోవధను నామమాత్రావశిష్టముగ తగ్గించివేయవచ్చునని తెలిసికొంటిమి.

ఆహారమునకై సాధారణముగ సంవత్సరముపొడవునను జరుగు గోవధపూర్తిగా నిలిచిపోవలెనని నాకెంతయో గట్టికోర్కెగలదు. కాని, అది యింతత్వరలో నిలిచిపోవలెనని నేను ఆశించుకోర్కె యిప్పటిలో నెరవేరునట్లు నాకుగోచరమగుటలేదు. ఎక్కువ ఖరీదుగలమాంసమును కొనుక్కొనగల మహమ్మదీయులు సాధారణముగ గోమాంసమును తినరు కాని, పట్టణములలోనుండు పేదమహమ్మదీయులకు అదే ప్రధానమైన ఆహారముగానున్నది. రోహిలాదేశ మధ్యనుండి వచ్చిన నేను. వారిప్పటిస్థితిలో గోమాంస భక్షణము మానుకొనుట యెంతకష్టమో యెరుగుదును. "ధాన్యముతో ధాన్యముకలుపుకొని తిను" మనుష్యులను చూచినప్పుడు పఠాను మనుష్యుడు ఆశ్చర్యపడక మానడు. "నాకు మాంసమునుండి తీరవలెను; చివరకు కుక్కమాంసమైనసరే మాకుండితీరవలె"నని రాంపురపు హాస్యగాండ్లు చెప్పుదురు. ఒకప్పుడు రాంపురసంస్థానములో. బ్రిటిష్ మునిసిపాలిటీలలో చేసినట్లు పట్టణపు మకాణములన్నిటిని మూసివేసి, ఒక్కచోటనే పెద్ద మాంసపు మార్కెట్టును పెట్టిరి. దీనివల్ల ప్రజలందరికిని మాంసము సప్లై చేయుట బహుకష్టమయ్యెను. సప్లయి చాలనందువల్ల పోటీ యెక్కువయ్యెను. యీతరగతిమహమ్మదీయుల విషయములో మా[illegible]ము ప్రస్తుతస్థితిలో ఆర్థికముగ తప్పనిసరియగుచున్నది.

ఈసందర్భములో గోవధను మాన్పుటకొక్కటే మార్గము గలదు. ఇప్పుడు తక్కువమాంసము బహు యెక్కువఖరీదునకు అమ్మబడుచున్నది. సామాన్యులు కొనుక్కొనుటకు వీలులేనంత ప్రియముగ నున్నది. కావున యీమాంసపుధరను తగ్గించి గోమాంసమునకును, తక్కువ మాంసమునకును ఖరీదులోగల తారతమ్యమును తగ్గించవలెను.

అసలే పేదపడియున్న యీదేశములో యేసంఘముయొక్కగాని జీవన విధానమును యెక్కువ ఖరీదుగలదానినిగ జేయుటకు నేను అంగీకరించను. అన్ని సంఘములకంటె మా ముసల్మాను సంఘము కడుపేదసంఘమని యెల్లరంగీకరించిన విషయమే. కావున వారివిషయములో కూడ జీవితముయొక్క ఖరీదును యెక్కువజేయజాలము. ఇచ్చటయింకొక విషయమును చెప్పకతప్పదు. ఎక్కువ ఆవులు హిందువులకే కలవు; అవిపాలిచ్చుట మానివేసిన తరువాత యజమానులా గోవులను అమ్మివేయకుండ తమవద్దనే యుంచుకొన్నచో గోవధ యిప్పటికంటె చాల తగ్గిపోవును. మనమిప్పటికైనను గొర్రెలు, మేకలు మొదలగు వానిని వృద్ధిచేసి గోవును సంరక్షింపవచ్చును. మన స్వరాజ్య గవర్నమెంటులో ఆదాయవ్యయ నిర్ణయమొనర్చుకొన్నప్పుడు మిలిటరీ ఖర్చులోనుండి చాలవరకు తగ్గించి యీపనికై వినియోగింపవచ్చును. అప్పుడు మనకీపని చాల తేలికయగును. అయినప్పటికి స్వరాజ్యము వచ్చేవరకు కనిపెట్టుకొనియుండక యీరోజునుండికూడ గోమాంసభక్షణ మానివేయవలసినదని నాసోదరమతస్థులను వినయపూర్వకముగ ప్రార్థించుచున్నాను. స్వరాజ్యము వచ్చినపిమ్మట మానివేసినచో అప్పుడది త్యాగమనిపించుకొనదు. భారతదేశమందున్న వివిధసంఘములకు సాంఘిక రాజకీయ వ్యవహారములందు స్వీయధర్మమైన సమిష్టికుటుంబత్వమే యాదర్శముగ నుండవలెనుగాని యింగ్లీషువారనుష్ఠించుచున్న పోటీ పద్ధతిపనికిరాదు. ఒకవేళ మనదేశములోని వివిధసంఘములకు పోటీయుండవలసినచో అది పరస్పరసహాసమందును, ఆత్మార్పణమునందును మాత్రమే యుండవచ్చును. తనకెంతయూ ప్రియమైన వాక్కులను గాఢముగ నాటుకొన్న భావములను యేసంఘమువారు సోదరసంఘముల కొరకై భారత వర్షముయొక్క శాంత్యైక్యతలకొరకై యెక్కువగ వదలుకొందురో ఆసంఘమువారే తుట్టతుదకు అందరికంటె యెక్కువ అజేయులగుదురని నామతము.



## ప్రాతినిధ్యమునందును పరిపాలనమునందును వివిధ మతములయొక్క భాగనిర్ణయము.

వివిధమత వైషమ్యములకున్న ముఖ్యకారణమును గూర్చియు, విద్యావంతులగువారు తమస్వార్థముల కొరకువాని కపార్థములు కల్పించియెట్లు దుర్వినియోగము చేసినదియు తమకు వివరించియున్నాను. వైషమ్యములకు గోవధయు సంగీతముతో నూరేగింపులు మొదలగు విషయములు మాత్రమే కారణములు కావు. స్థానికములును రాష్ట్రీయములును అఖిలభారతీయములగు సంస్థలలోని ప్రాతినిధ్యమును ఉద్యోగము లనుభవించుటలోని హెచ్చుతగ్గులును పరస్పరవైషమ్యములకు మూలకారణములై యున్నవి. ఈవిషయములలో సామాన్యజనులపై నేరము మోపుట సమంజసముకాదు. మంచివిగాని చెడ్డవిగాని స్వార్థములుమతరక్షణమనుముసుకక్రింద నిట్టిపరిస్థితులకు ముఖ్యకారణములగుచున్నవి. ఇందువలన గలిగెడి యన్యాయము యెక్కువ సమర్థతయనియు యెక్కువ విద్యావిషయకములైన యోగ్యతలనియు సమర్థింపబడుచున్నవి. ఎవరు వీనిని సమర్థించుచున్నారో వారే విదేశీయాధికారులిట్టి మిషలు కల్పించినప్పుడు దయాశూన్యముగ ఖండించుటకూడ మిక్కిలి యాశ్చర్యముగానున్నది. ఇట్లు పదవులాక్రమించినవారు తామందరికంటె యనుభవముకలవారమను నపోహను పోగొట్టుకొననంతకాలము అల్పసంఖ్యాకుల తెలివి ప్రజ్ఞాశయముల నెట్లుకాపాడగలరో నాకు తెలియకున్నది. వీరు విశాలహృదయులై దేశభక్తితో పాటుపడవలయునుద్దేశ్యముగలవారు కొంతకాలమును ఒక్కసంఘమువారియొక్క విద్యాధిక్యత యితరసంఘములవారి కుపద్రవకారణముగ తోపకమానదు. ఒకప్పుడుద్దేశ్యముమంచిదే యైనను ననుమానమునకు కారణమగుచున్నది. సోదరులారా! ఇది వెనుకటి తరమువారు చేసిన యన్యాయఫలముగననుభవించుచున్న ప్రారబ్ధము. అనవసరముగకోపపడకుండునున్న

ముదానిననుభవించితీరవలయును. వర్తకమునవలె రాజకీయమునందుకూడ పంపకములనిని సంపాదించుకొనవలసి యున్నది. అందుచేప్రజల నాకర్షించుటకై చేసెడి ప్రగల్భములకంటె కార్యాచరణమును తత్ఫలితముగా వచ్చులాభములును కాలక్రమమున మనకు పలుకుబడినియ్యగలవు. అల్పసంఖ్యాకులుగల సంఘములు అధిక సంఖ్యాకులుగల సంఘములు చేసిన యాహ్వానముల ననుమానముతో చూడక వారితో కలసి పనిచేసిన యడల స్వతంత్ర స్వరాజ్య సంపాదన మార్గమున చాలదూరము నడచియుందుము. కాంగ్రెసను సామాన్యరంగస్థలమున కందరమును మన యుద్దేశ్యములు దేశభక్తి పూరితములని చాటుటకు మంచియవకాశముల నొసంగుచున్నది. ఆలస్యమైనను పలుకుబడిని సంపాదించనిది మనమేమియు చేయజాలము. అకారణమైన యనుమానములకు కోపపడుటయు అట్టి యనుమానములు కలవారినోళ్ళనుమూసి వారికి మనపైలేని నమ్మకము నున్నదని చెప్పుచు మోసము చేయుటయు మంచిపనికాదు. శాసనసభలకు వెడలవలెనని తీర్మానించుకొనిన మనవారిని, అధికారివర్గమువారిని కూడ మనకొసంగబడిన స్వల్పరాజ్యాంగ సంస్కరణముల నిచ్చుటకు బలవంతపెట్టిన లక్నోయొడంబడిక యిప్పటికి బహుశం తృప్తిపరచియుండవచ్చును. ఒకవేళ తృప్తిపరుపకపోయినను మనమందరము సజాతీయా దర్శముగా నుంచుకొనిన స్వరాజ్యముకొరకు ప్రయత్నించి త్వరలో సంపాదించుటకు మసలనింకను పురికొల్పవచ్చును. అప్పుడు మనము ప్రాతినిధ్యముగల యన్ని సంస్థలందును వివిధ సంఘము లనుభవించు భాగలబ్ధములను నిర్ణయించుకొనవచ్చును. సోదరులారా! ఇంకను కొంతకాలమువరకు ప్రత్యేకనియోజకవర్గము లేకుండ నెగ్గలేమని యనుమానించుచున్నాను. కాని యల్పసంఖ్యాకులగు సంఘమువారు అట్టి యేర్పాటు లనవసరమను కాలము వచ్చునపుడు మిక్కిలి సంతోషింపగలనని నొక్కిచెప్పుచున్నాను. అర్నీ



నియాయను పేరుగల టర్కీదేశముయొక్క తూర్పుభాగమునగల క్రైస్తవసంఘములనుగూడ భారతీయదేశమునందలి పద్ధతిని నెలకొల్పవలయునని నేను గట్టిగావక్కాణించితిని. అందుచేత నాప్పాదత నిజాభిప్రాయములను మీరు బాగుగా తెలిసికొనగలరు.

ప్రత్యేక నియోజకవర్గ సిద్ధాంతమును వదలివేయుటకు పూర్వము రెండుపనులుచేయవలయును. అల్పసంఖ్యాకమగు సంఘముతన యిష్టమువచ్చినభారతీయునిప్రతినిధిగా నెన్నుకొను స్వాతంత్ర్యముగలిగి యుండుట మొదటిపని. ఏదినమున నొకమహమ్మదీయేతర సంఘము నన్ను తమప్రతినిధిగా నెన్నుకొనునో యాదినమును నాకు మిక్కిలి గౌరవప్రదమని భావింతును. నేనునమ్మకముతో వోటునిచ్చుటకు ఖిలాఫతు కొరకు ఘోరయుద్ధమొనర్చిన శ్రీగాంధిమహాత్మునుగాక మరియొక మహమ్మదీయునుగానరాడు!

క్రమముగ పరిస్థితులలో కొంతనుంచిమార్పు కలిగినవెనుక ప్రత్యేకనియోజకవర్గము బదులు సంయుక్త నియోజకవర్గమునేర్పాటు చేయుట రెండవపని. మార్లేసంస్కరణములు చర్చింపబడు కాలమున కొన్నితావుల సంయుక్తనియోజకవర్గము నుండనిచ్చి కొన్ని సభ్యత్వములను కోల్పోవుటకంటె సభ్యులసంఖ్య యల్పమైనను ప్రత్యేకనియోజకవర్గమునుకోరుట క్షేమకరమనివాదించు శ్రీసయ్యదు అమీరాలీగారిని ప్రతిఘటించితినని మీలోకొందరికి తెలియును. సంఘములందలి పరస్పర వైషమ్యములడుగంటినకొలది క్రమముగ ప్రత్యేకనియోజకవర్గములచేత నెన్నుకొనబడు సభ్యులసంఖ్యను తగ్గించి సంయుక్త నియోజకవర్గపు ప్రతినిధులసంఖ్యను హెచ్చింపవచ్చును. తుదకు ప్రతినిధులందరును సంయుక్తనియోజకవర్గముచే నెన్నుకొనబడునట్లు చేయవచ్చును. ఇట్లే యుద్యోగముల విషయమునకూడ సంఘప్రాతినిధ్యము నిచ్చుట

కంటె సామాన్యముగ యోగ్యతనే ముఖ్యముగాగొనుపద్ధతి నవలంబింపవలయును.

కొన్నిస్థలములలో చర్చింపబడు విషయము లల్పములైనను, ప్రజలుద్రేక పూరితులగుట కవకాశముండుటచే స్థానికసంస్థల ప్రాతినిధ్య విషయములలో పై సందర్భములను తప్పక నాలోచింపవలయును. మ్యునిసిపల్ సభ్యత్వముల విషయములలో పంజాబునందున రెండు సంఘములకును వచ్చిన వైషమ్యములకు పైనచెప్పినవిషయములే కారణములని యుదాహరింప విషాదకరముగనున్నది. తలచినప్పుడు జలియాన్వాలాబాగును, హైందవులు కడుపులమీద ప్రాకింపబడిన వీథియు నిజముగ పంజాబురాష్ట్రమందలివా యని యాశ్చర్యపడుచుందును. ఎంతలో నారాష్ట్రము తనకు కలిగిన యవమానమును మరచెను.

—:సంకుచితదృష్టి:—

ఈ యుపన్యాసము నందలి అధమభాగమున 1904 సంవత్సరమున నేనిచ్చిన మరియొక యుపన్యాసమునందలి భాగము ననువదించుచు అందరికి సమానమగు శత్రువొకని నెదిరించుటయను సూత్రముపై కేవల మాధారపడి దానివలననే సంఘముల కైక్యముపొసగగల దనుటపొరబాటని చెప్పితిని. పంజాబునసైనిక శాసనోపయోగకాలమునజరిగిన ఘోరంతములనుగూర్చి యూరక పాడినదే పాడుచుండుటచే నైక్యమును కుదుర్చుకొనగలమనిపిచ్చినమ్మకము కలవాడనుకాను, మంత్రివర్గముచేయు పనులయెడల నసమ్మతిని చూపుకాలమునను, కష్టకాలమందును, ననేకమారులు సంయుక్త ప్రభుత్వములెన్ని సృష్టికాలేదు. ఎన్నికల జయముచే కూడినవెంటనేగాని, మొదటిదినములోనేవిచ్ఛిన్న భగ్నముకాలేదు? మనము పొందవలంచినస్వరాజ్యముసంపాదింపవలెనన్నను దానిని నిల్పుకొనవలెనన్నను, బాధానుభవ సామ్యముగాక మరియొక బంధనముచే నన్నిసంఘములకు నైక్యముకుదురవలయును. హిందూమ



హమ్మదీయులకుండు పరస్పరవిభేదములను గోరంతలను కొండంతలుగ చేయు మహానుభావులకు నేనొక్క విషయము జ్ఞాపకముచేయవలయును. ఆరెండు సంఘములవారును పరస్పరమొకరినొకరు పెట్టినబాధలు జలియనువాలాబాగులో అందరును చచ్చినంతవరకు కాల్చినను జనరలు డయ్యరుయొక్క నిశ్చయముకంటెను, జనులనొక వీధిలో పొట్టలతో ప్రాకించిన జాతీయావమానముకంటెను, క్రూరములైనవియా? ఉత్తర దేశస్థులమైన మేము దృష్టిసంకోచమునకులోనై యున్నామనియు, కాలము గడచినకొలదియు వెనుక గడచినదానిని క్రమముగ మరతుమనియు నాయభిప్రాయము. తురకు ప్రస్తుతము పడుబాధలు కొలదికాలముక్రిందట పడిన భయంకరములైన బాధలను సంపూర్ణముగ మరపించుచున్నవి. ప్రతిసంఘమును తమయొక్కటి సంఘము చేతిలోపడిన బాధలను మాత్రమే జ్ఞాపకముంచుకొని తానితరసంఘములకు పెట్టినబాధలను మరచుట యంతకంటె విషాదకరము!

—:పోకిరీజట్లు:—

నేనిప్పుడనేక సంఘములనుగూర్చి మాట్లాడితిని. ప్రజలలో కల్లోలములు పుట్టినప్పుడు యితరులను బాధకలుగ జేయునది సంఘములు కావు. ఇండియా ప్రజలలోనున్న పోకిరీజట్లులే శాంతిప్రియులగువారికి బాధ కలిగించుచుందురు. ఈపోకిరీలు యేసంఘమునకును చెందరు. వారిది ప్రత్యేకమొక సంఘము. వారికేమి దొరకినను సంతసమే. యుద్ధసమయమున పాంచాలరాష్ట్రమందలి కొన్నిజిల్లాలలో మహమ్మదీయ పోకిరీలవలన శ్రీమంతులగు హిందువులు బాధల నొందినపుడు, లాలా లజపతిరాయిగారు అమెరికాదేశమున ప్రవాసమనుభవించుచు వ్రాసిన వ్యాసము నాకుబాగుగ నచ్చినది. అప్పటికి పరస్పరసంఘ కలహములు విజృంభించునేమో యనుభీతివ్యాపించెను. కాని లజపతిరాయిగారు మాత్రము హిందువులు ధనికులగుటచే బాధింపబడిరిగాని, "హిందూధ

ర్మము నవలంబించుటచే కాదని సత్వరముగ బోధించిరి. ధనికులకును నిర్ధనులకును గల వైరమేగాని, హిందూమహమ్మదీయ విభేదముకాదు. ఈ రెండు సంఘములేగాక, మధ్యనుండి మనపోరాటముల చూచి సంతసించు పరాయివారు (విదేశప్రభువులు) న్నపుడు మనమీ సందర్భమున ముఖ్యముగ గమనింపవలసి యున్నది. ఉత్తరహిందూస్థానమున మతవిద్వేషములు ప్రారంభమైనపిమ్మట, రవీంద్రనాథకవి వర్యులందునుగూర్చి అనేకపర్యాయములు మాటలాడి యున్నాడు. కాని వారి యుపన్యాసములను పత్రికలలో చదివినప్పుడు ఆయనగారే 1917 సంవత్సరమున బీహారురాష్ట్రము నందింకను ఘోరమగు విషయములు.

గోహత్య సందర్భమున బుద్ధిపూర్వకముగ సలుపబడినపుడు వ్రాసినదానిని వారు మరచిపోయినారాయను సంశయము కలిగినది. కవీశ్వరులు రైలుబండిలో బ్రిటీషు సైనికోద్యోగితో కలసి ప్రయాణము చేయుచుండిరి. ఆయుద్యోగి భారతీయాశయములను పరిహాసించుచు "ఏమండీ! వేరువేరు మతములవారు ఒకరితో నొకరు కలహించుచు, మధ్య శాంతిస్థాపనకై అప్పుడప్పుడు నన్నును నా సైనిక దళమును పిలిపించుకొనవలసిన స్థితియందుండి, మీ భారతీయులు స్వరాజ్యము పేరెత్తుటెందులకు?" అనెను. మన బాధలజూచి సంతసించువారున్నారను విషయమును కవిగారా సమయమున జ్ఞప్తికి తెచ్చుకొని, సైనికోద్యోగికందులగూర్చి తెలియజెప్పెను. బ్రిటీషువారు రాకపూర్వ మీతగాయిదాలు లేకుండెనా అని యుద్యోగిమరల నడుగ, కవిగారది వాస్తవమేయని యొప్పుకొనుచు, అప్పటికిని భేదమొకటిగలదని వెంటనే బోధించిరి. బ్రిటీషువారు రాకపూర్వమును హిందూమహమ్మదీయ పోరాటములుండెను. కాని, అందువలన శాశ్వతశత్రుత్వ మేర్పడక, అచిరకాలముననే సమాధానము కుదురుచుండెను. కోపము చల్లారినతక్షణమే, తామందరమును మంచికో చెడ్డకో కలసి యొకదేశమున నివసింపవలసి



యుంటిమనియు, ఏదోవిధముగ స్నేహభావమును సంపాదింపనిచో జీవితమంతయు దుర్భరముగ నుండుటచే సత్వరముగ పొత్తుకలుపుకొని ద్వేషభావమును పోద్రోలుటయే సమాజసమనియు, గ్రహించుచుండిరి. కాని, మూడవవారైన విదేశప్రభుత్వము వచ్చినప్పటినుండియు, అట్టి పోరాటము లధికమై అట్టి కలయికలు అపరూపమై పోయెను.

"యీసా" యొక్క చేయి; "జేకబ్" యొక్క స్వరము.

కుటుంబములో భార్యభర్తలిరువురేగాక, మధ్య మూడవది అత్తగారుకూడనున్నచో తమకెంత ఘోరముగనుండునో భారతదేశ స్త్రీలకును, యూరపుదేశపు పురుషులకును బాగుగ తెలియును. కుటుంబములో అత్తగారు స్థిరముగనుండు వ్యక్తియగుటయే గాక, కుటుంబచక్రమంతయు ఆమె యొక్క చేయే త్రిప్పుచుండును. అట్టిస్థితిలో ఆసంసారము యొక్క పొందిక యెట్లుండునో వేరుగ చెప్పనక్కరలేదు. అదిగాక యింతకంటె ఘోరమైనసంగతి యింకొకటియున్నది:—అత్తగారికి రెండుహోదాలున్నవి. ఆమె భార్యాభర్తలిరువురికిని మాతృస్థానమందున్నది. అందుచే, సందర్భానుసారముగ యిరువురిని ఓదార్చుచుండును; లేదా ఒకరిని ఓదార్చి, రెండవవానిని చీవాట్లుపెట్టుచుండును. అందుచే భార్యాభర్తలకు పొత్తుకలియక "ఎవరికివారు విడిగనుండిన బాగుండునురా" యనిపించుచుండును. కాని రెండుముఖములుగల యీయత్తగారి మాయలకు లోబడకుండ వివేకముతో నున్నచో యీమె తంత్రములు మనలనేమియు చేయజాలవు. అవి మనకు నవ్వును మాత్రము పుట్టించును. హిందువునకు కోపమువచ్చునట్లుగ మహమ్మదీయుడు గోవును చంపినప్పుడుగాని, లేక ప్రార్థనజరుగుచుండగ మసీదుముందునుండి హిందువు లెవరైన మేళతాళములతో ఊరేగినప్పుడుగాని మనమేమి చేయుచున్నాము. ఒకరిగొంతుకుల నొకరు నరుకుకొనుటకు

పరుగెత్తుచున్నాము. కాని యీసందర్భమున మనమొకసంగతిని మాత్రము మరచిపోవుచున్నాము; ఏమనగా :—

గవర్నమెంటువారెప్పుడైన మహమ్మదీయునొకని యేరాజద్రోహనేరముక్రిందనో శిక్షింపదలచినప్పుడు అతనిని పట్టియిచ్చుటకు మనమహమ్మదీయులే యెందరుబయలుదేరుట లేదు? అట్లే హిందువులను బట్టియిచ్చుటకై హిందువులే యెందరుబయలుదేరుట లేదు? ఈసందర్భములో ఉభయసంఘములును ఒకేతరగతిలోనున్నవి. ఎంతఘండాలపుపనినైనచేయుటకు సిద్ధముగనున్నవారు ఉభయసంఘములలోను గలరు; ఇది మనకష్టానుభవైకవేద్యమే. ఒకమహమ్మదీయుడు తనసోదరమహమ్మదీయునే— వేయేల తనమహమ్మదీయసంఘమునంతటినే— హింసించుటకు సిద్ధముగ నున్నప్పుడు యిక హిందువుడు మనలనుహింసించినాడని యావేశపడనేల? అయ్యా! అసలునిజము అదికాదండీ! పోకిరీలవలెనే ద్రోహులుకూడ ప్రత్యేకమొక్క సంఘమునకే చెందియుండలేరు. వారు ఉభయసంఘములలోను వున్నారు. వారిదిప్రత్యేకమొకతెగ. ధనమదాంధులు ఒక్క యింగ్లండులోనేగాక ప్రపంచమందంతటను గలరని లేబరు (కార్మిక) కక్షివారు చెప్పినమాటలువినేయుందురు. అట్లేద్రోహులు అన్నిసంఘములలోను నున్నారు. వీరినందరిని మనమంతకంటె యెక్కువగ ఖండించవలసినదే. ఏమహమ్మదీయుడో రాత్రివేళ హిందూదేవాలయములో గోమాంసము వేసియో, విగ్రహములను పగులగొట్టియో దానినపవిత్రమొనర్చునుగాక; కాని తక్కినమహమ్మదీయసంఘమంతయు (హిందూసంఘమువలెనే) యేపాపమెరుగక పోవచ్చును. అట్లే యేహిందువుడో మశీదులో పందిమాంసము వేసియో, కొంటెపనిచేసియో మర్యాభంగమొనర్చుననుకొనుడు; కాని తక్కిన హిందూసంఘమంతయు కేవలము నిరపరాధము గావచ్చును.



దీనికంటె స్పష్టమగు నుదాహరణ యింకొకటిగలదు. మంత్రి మహమ్మదీయుడైనచో మహమ్మదీయుల కెక్కువ యుద్యోగములివ్వవచ్చును. హిందువుడైనచో హిందువుల కెక్కువపక్షపాతము జూపవచ్చును. వారేకులమువారైనను వారు పరప్రభుత్వమందంతర్భాగములైయున్నారనుట స్పష్టము. చేతులు "యీసౌ" చేతులే, కాని గొంతుమాత్రము "జేకబ్" గొంతుకయైయున్నది. డయ్యారు, ఓడయరులపించనుల నింకను నిలిపివేయవలసియున్న రాష్ట్రప్రజలు, తమజనులను ఖూనీలుచేసినవారికి తమసొమ్మునిచ్చి తీర్చవలెననినిర్బంధించుగవర్నమెంటుతో సహకారమొనర్చుటకు సిద్ధముగనున్నారు. కాని, తమపొరుగువారును, తమతో సమానముగ కష్టముల ననుభవించిన వారునగు వారితో మాత్రము సహకారము మానుకొనుచున్నారు. ఎందువల్ల? యితరసంఘమునకు చెందిన మంత్రియెవడో యొకడు తనసంఘమువానికి, యీసంస్కరణములవల్ల తనచేతికివచ్చిన యేయల్పాధికారమును బట్టియో, యేతుచ్ఛమగు పక్షపాతమునో, తనకిష్టములేని విధమున చూపించెనట! యీకారణముచే ఆసంఘముతో తామసహకారము మానుకొందురట! అట్లయినచో సహాయనిరాకరణమనగ నేమో నాకర్థమగుట లేదు. ఇప్పుడే యుద్యోగముల మానుకొనుమనుట కొంచెము కష్టమని తెలిసియుండియు, ఉద్యోగములు రాజీనామాయిచ్చినవారిని కాంగ్రెసు బాహాటముగ ఆహ్వానించుచున్నది—కాని కాంగ్రెసు మనుష్యులమని చెప్పుకొనువారిలో కొందరు, సహాయ—నిరాకరణమును గూర్చి గాంధిమహాత్ముడు తమకు చెప్పినదంతయు మరచిపోయిరి. ఎందువల్ల ఎవడో మంత్రి తనసంఘమువానికి యెక్కువగ యేవో యల్పయుద్యోగపదవులనిచ్చెనట! ఇట్లుచెప్పిన మంత్రి నాస్వమతస్థుడైనచో నాపరితాపమునకు మితియే లేకుండెను. అదిగాక యిట్టి యల్పయుద్యోగములు తమకు రాలేదనుయేడ్పు నాస్వమతస్థుల

నుండి వచ్చినచో, నాకప్పుడు గలుగుసిగ్గు పైనగలిగిన పరితాపమున కంటె వెయ్యిమడుగు లెక్కువగ నుండును. ఒకప్పుడు మాస్వమత స్థులుకొందరు ముల్తాను మశీదులో పగిలిపోయియున్న పాత్రలను గోడమీదనున్న గీట్లను హాకీంఅజ్మల్ ఖాన్ సాహెబుగారికి చూపించి "ఇదిగో ! హిందూ దేవాలయములు పాడైపోయినచో, మన మశీదులుమాత్రము పాడుకాలేదా"యని యతికి ప్రీతిగ చెప్పినప్పుడు తన కెంతటి సిగ్గుపాటును అవమానమును గలిగెనో అజ్మల్ ఖానుగారు నాతో చెప్పిరి. వారికి త్వరలో సంపూర్ణారోగ్యము గలుగుగాకయని మనమందరము ప్రార్థింతము.

వివేకురాలియొక్కయు అవివేకురాలియొక్కయు నీతికథ.

ఈవిషయమై హిందువుల యుద్దేశ్యములు, మంచివికావనియే దలంచియుంటినేని దీనినెన్నండును నేనుచ్చరించియుండను. నేనిట్లు జేయుటకుగారణమే మనమహమ్మదీయుల భావసంచలనము ఉత్తమమని నేను నమ్మజాలను. ఈయుభయపక్షములును ఈతుచ్ఛభావములకు లోనైనవియే. మహమ్మదీయులు మెరుగైనను హిందువులనుగూర్చి వచియించియుండను.

ఏలనన ఒకసంఘములోని వ్యక్తి వేరొక సంఘములోని వ్యక్తులను మందలించుటవలన లాభములేదను సంగతి యనుభవమువలన నేనెరుంగుదును. ఆపని వారలకే వదలివేయవలయును. ఒక్కపట్టణమున ఒకేచోటను వసియించు చిన్నబాలురుకలిసి యాడుకొనుచు యల్పవిషయములలో తగువులాడు కొనుచుండుట యెన్నిమారులు మనముచూచియుండలేదు? ప్రతిబాలుడును తనతల్లియొద్దకు బరువెత్తి తక్కటియాటకాండ్రదుర్మార్గకథనముచు తనసద్గుణసంపత్తి జాలిగల్గునట్లు వర్ణించుచుందురు. వివేకురాలగు తల్లి వానియందేలోపమున్నదని తనకుమారుని చీవాట్లుపెట్టును. తన తనయుడింకను కొంటెములు



చెప్పుట మానకుండునెడల స్నేహపాత్రులు గాని పిల్లలతో నాడుకొనవలదని యామె వానికి హితముజెప్పును. పిల్లలకందరకును సామాన్య ఆటభూమి యగు యావీధికి బోవలదని యాజ్ఞాపించును. సద్గుణగరిష్ఠుడగు మనబాలుడు ఒంటరిగానుండవలసి వచ్చును. కొద్దికాల మెడబాటుతో, తప్పు తోడిబాలురది కాదని తలంపసాగును. రెండు మూడు రోజులయినతరువాత వారల సంపూర్ణముగ దోషరహితుల నొనర్చివేయును. మరల తనతోడిబాలురతో నాడుకొననిమ్మని తన తల్లి నడిగి యామె యంగీకారమును బడయును. తాను మంచివాడననియు, తోడివారలు చెడ్డవారనియు, తోడిబాలురపై దోషములనెన్నవలదని మందలించి తల్లిపిల్లవానికి బుద్ధులుజెప్పి మరల వారలతో నాడుకొన బొమ్మనును. శాంతిగూర్చుట కియ్యదియే మార్గము. వివేకురాండ్రగు తల్లులను, అవివేకురాండ్రగు తల్లులనుగూడ జూచియుంటిని. బహుశః రెండవతరగతి వారలసంఖ్యయే యెక్కువగనుండును. అవివేకురాండ్రగు తల్లులు తమతనయులు తోడిబాలురతో తగవులాడి సానుభూతికిని తోడ్పాటునకును తమయొద్దకు బరుగెత్తివచ్చినప్పుడు తమ చిన్నతనయులకొదవిన కష్టములకు విచారపూరితలై కన్నీరుబుచ్చెదరు. కొంతతడవట్లు విచారించి సక్రోధులగుదురు. వారలకు విషాదముదరిగి క్రోధమంకురించును. పిమ్మటవారలు తక్షణమే యాదుష్టబాలునితల్లియొద్దకు బోయి యామెతనయుడొనర్చిన దుశ్చేష్టలను తమప్రియసుతుల కొదవిన కష్టములను నేకరుపెట్టుచు యామె తన తనయునికి సరియగు బుద్ధులు గరుపలేదని నిందింపనారంభింతురు. అందులకాతల్లి ఫిర్యాదుజేసిన బాలుడు పెద్దదయ్యమనియు ఐనను అది వానిదితప్పుకాదనియు, ఆపిల్లవానినిపోషించు తల్లితప్పే యనియు బదులుజెప్పును. తగవులాట ప్రారంభమగును. ఉభయపక్షములును తిట్టుకొననారంభింతురు. ఉభయపార్శ్వములనుండియు మాటా

శరజాలములు గురియుచుండును. ఇరుపక్కలను నేడుతరముల వరకును తిట్లుదినని వారుండరు. అంతట మగసైన్యము రంగస్థలిని ప్రవేశించును. ఆతడును అంతవివేకశూన్యుడును అంతటి దురభిమాన ప్రేరితుడును నైనయెడల, దూషణశతఘ్నుల విడువనారంభించును. వైదికపక్షముయొక్క మర్యాదను మంటగాల్చును. ఈరణగోణధ్వనివిని యెదిరిపక్ష సహాయసైన్యము యుద్ధభూమి నురికినతోడనే యాతడు వాగ్యుద్ధమున సంధిగోరును. కాని యెదిరిపక్షవీరుడు కార్యశూరుడగుటచే తిన్నగ శత్రువీరుని తల పగులవేయును.

అంతటితో నాపోరాట మంతరించు నెడల యీపట్టణభాగ మధ్యస్థముజేసికొనినడే. కలహకారులగు నాబాలకద్వయముయొకరి భుజములమీద నొకరు జేయివైచికొని, రక్షకభటులు తమతల్లిదండ్రులను నడిపించుకొని పోవుచుండ తాము మాత్రము వుప్పట్లను, బంతులాటను ఆడుకొనుటకై నడచిపోవుటయె యిందలివిచిత్రము. వివిధకక్షులకు జనించు అంతఃకలహములు, నేనప్పుడప్పుడుగావించినట్లు) స్వపక్షసదుద్దేశముల బ్రకటించుకొనుటవలనగాని, నిష్కపటమై నిష్పక్షపాతమగుబుద్ధితోడ నుభయకక్షులకును మధ్యవర్తిగానుండుట వలనగాని, దీనవని[illegible], స్వపక్షదూషణను గురియగుటయే యట్టి అంతఃకలహముల దీర్చుట కుత్తమమార్గమనియు, ననుభవమువలన విదితమయ్యెను. ఈవిషయమున నాకును నాసోదరులకును విశ్వాస ముదయించుటచేతను, నేను స్వపక్షదూషణకు బాల్పడి యుంటచేతను నిక్కవమైన దేశభక్తుని ధర్మమును నిర్వర్తించుటకు నేనర్హత సంపాదించుకొంటినని నాకు సంతుష్టిగల్గుటయేగాక రెండు పక్షములకును సమాధానము కుదురునను యాశలు జనించుచున్నవి. విపక్షముల మిత్రులకును నేనీరాజకీయ సాధకముల సిఫారసు జేయుచున్నానని వేరే జెప్పనక్కరలేదు.



—:సంఘటనము:—

నాయుద్దేశము నింతతడవు విప్పి జెప్పినబిమ్మట సంఘటనమును గూర్చి వేరేవచింపవలసియుండునని తోచదు. నేనీయుద్యమము నెన్నడును దూషింపలేదు. ఎవ్వరేని యట్లుదలంపక విరుద్ధభావములతో నుండిరేని వారలు పొరబడియుందురు. లేకున్న సందర్భవశమున నేనాడినమాటలనుగాని నేనిచ్చినయుపన్యాసములనుగాని యితరులు పొరబాటుగాజెప్పిన విని యపోహపడియుందురు. ఇయ్యది కేవలము నాహిందూసోదరులను సంబంధించిన విషయము. సంఘటన మావశ్యకమని వారలు తలంచునెడల నావిషయమున దమయిష్టమువచ్చినట్లు జేసికొనుటకు వారలకు స్వేచ్ఛ నొసంగవలెను. ప్రతిసంఘమును, తనకు అవసరమనితోచు సాంఘిక సంస్కరణముల గావించుకొనుటకు హక్కుగలదు. అస్పృశ్యతను దొలంగించుటకును అంత్యజుల తక్షణమె, సంఘమున జేర్చుకొనుటకును యీసంఘటనము నిర్మాణమయ్యెనేని, కాంగ్రెసువాదిగను మహమ్మదీయునిగను గూడ మిగుల సంతసించెదను.

హిందూమతమున కొదవిన నస్పృశ్యతాకళంకమును దొలగించుటకు యావచ్ఛక్తిని వినియోగింపవలెనని నాగపురకాంగ్రెసునందు ప్రతినిధుల హెచ్చరించినప్పుడును నిమ్నజాతులయెడ జూపబడు నిరాదరణ విషయమున హిందూమతము సంస్కరింపబడుట వాంఛనీయమను నుద్దేశమును బెంపొందచేయవలయునని మతగురువుల వినయపూర్వకముగ వేడుకొనినప్పుడును, యీసమస్య కాంగ్రెసు మహాసభయొక్క ప్రత్యేక సానుభూతిని బడసెను. 1921 సంవత్సరాంతమున స్వరాజ్యవాంఛకు, అస్పృశ్యతానివారణ మొక నిదర్శనమని మహాత్ముడు నిర్దేశించును. హిందుమతమున నావశ్యకమగు సంస్కరణముల గావింప, పూర్వాచారపరాయణులకు నిలయములగు హిందూమత సంఘ

ములు సంకల్పించుకొనునెడల, ఆవిశాలహృదయుని యనుచరులను సంతోషభరితుల జేయును.

కాని యీవిషయము చాలకాలమువరకు జరుగకనే యుండెను. మలబారులో జరిగిన విషాద సంభవములు దవ్వులనున్న పాంచాలహిందువుల నాగ్రహపూరితుల జేసినవిమ్మటను, ముల్తాను పట్టణము నవసించు హిందువులు శిక్షణాపూర్వులగు మహమ్మదీయమూకల ద్వేషానలమునకు గురియై వంతలనొందినపిదపను, యీసంస్కరణమును గడుదీక్షతో కొనసాగింప మొదలిడిరి. ఈసందర్భముతో భారత జాతీయైక్యతకై బరితపించువారలకు విషాదము గలిగించును. ఏలనన నూతన స్థాపితమగు నైకమత్యమింకనుబలీయముకాలేదని వారలెరుంగుదురు. విరిగి ఔషధచికిత్సనుండి, యప్పుడే కట్టువిప్పబడిన యవయవమునకు, మోయలేని బరువు నెత్తజనదు. ప్రతియపోహను ప్రతి వదంతిని నిజమని నమ్మకపోయినను, వేగమె తొలగింపబడకపోయినయెడలగాని, నిజముకాదని ఋజువు కాకపోయినయెడలగాని, దానివలన కల్గు హానినిమాత్రము చులకనచేయజనదు. నిమ్నజాతులను హిందూసంఘమున జేర్చుకొనుటమాత్రమే అస్పృశ్యతానివారణోద్దేశముగాదనియు, ముందుగజరుగబోవు పోరాటములలో నిమ్నజాతులను హిందువులకు సహాయులుగ జేసికొనుటకే యీ యస్పృశ్యతానివారణోద్యమము బయలుదేరెననియు, కొందరు మహానుభావులు వదంతులు బుట్టించుచున్నమాట వాస్తవము. “దౌర్జన్యరాహిత్యము అసహాయోద్యమసిద్ధాంతమున ముఖ్యభాగమగుటచే, దానిని ముఖ్యముగ గమనింపవలెననియు”; వాక్క్రియలయందు దౌర్జన్యరాహిత్యము ప్రభుత్వముపట్ల నెంత యావశ్యకమో ప్రజలలో నొండొరులయెడకూడ నంతయే యవుసరమనుసంగతి, ప్రజలకు దెలియజెప్పవలయుననియు; దౌర్జన్యభావములు నిజమగు ప్రజాస్వామ్యతత్వమునకువిరుద్ధముగుటయేగాక, సహాయనిరాక



రణోద్యమ ప్రణాళికలోని తక్కటి యంశముల యాచరణకుగూడ భంగము గల్పించుననియు; మహాత్ముని యనుచరుల కుద్బోధించియుండ, ఇట్టి పరిస్థితులు వారికి సంతాపకారణము గాకుండునా? అస్పృశ్యతాకంటకమును నిర్మూలించుటలో దౌర్జన్యమునకు గడంగి, యిదివరకున్న దౌర్జన్యమును మరింత వృద్ధి యొనర్చితిమని మనల లోకము నిందించు నెడల, మహాత్ముని హృదయము బరితపింపదా? మిత్రులారా! వారల కొదవిన కష్టముల నివారించుటకే నిమ్నజాతులతో చెలిమిజేయనగును. ఇతరులకు బాధకల్గించుటకుగాని, మనకుగల్గిన బాధలకై నితరులపై పగదీర్చుకొనుటకుగాని వారలతో మైత్రి యొనర్పకుడు.

సంఘటనోద్యమముయొక్క యింకొక లక్షణమేమనగ :—వ్యాయామసాధన యందెక్కువగ అభిలాషను గలిగించెను. ఇదంతయుమంచిదే. మన భారత ప్రజలలో నెవరినుండియైన స్తబ్ధతయు, పిరికితనమును వీడిపోయినచో, మనము సంతోషించవలసినదే. కాని, దీనిలోకూడ భావశుద్ధి గావలసియున్నది. క్రిందటి సెప్టెంబరులో ఢిల్లీలోజరిగిన హృదయపూర్వకమగు చర్చవల్ల అన్ని సంఘములయువకులకును పనికివచ్చు “అఖాడా” లు నిర్మించుట తనకును సమ్మతమేయని పండితమదనమోహనమాళవ్యాగారు లోకమునకు ప్రకటించుటకు అవకాశమేర్పడెను. ఇందుకు నాకు చాలసంతోషమైనది. మరియు ధనప్రాణాదులయొక్కయు—చెప్పుటకు నాకు విచారమగుచున్నది—సోదరీమణుల మానముయొక్కయు సంరక్షణార్థమై సామాన్యమగు స్థానికపౌరభటదళము నొకదానినినిర్మింపవలెనను తమ మొదటియుద్దేశమునుకూడ మాళవ్యాగారు ప్రకటించిరి. తనయుద్దేశము ఒక్క హిందూసభచేతనే చర్చింపబడుటచే, అది అన్నిమతములను బాధింపజాలదను ఉద్దేశముతోనే మాలవ్యాగారు తమతీర్మానమును సవరించి, హిందూభటదళమును నిర్మించుటకు సమ్మతించెరు.

ములు సంకల్పించుకొనునెడల, ఆవిశాలహృదయుని యాతనియనుచరులను సంతోషభరితుల జేయును.

కాని యీవిషయము చాలకాలమువరకు జరుగకనే యుండెను. మలబారులో జరిగిన విషాద సంభవములు దప్పులనున్న పాంచాలహిందువుల నాగ్రహపూరితుల జేసినపిమ్మటను, ముల్తాను బట్టణము నవసియించు హిందువులు శిక్షణార్హ్యులగు మహమ్మదీయమూకల ద్వేషానలమునకు గురియై వంతలనొందినపిదపను, యీసంస్కారణాముమును గడుదీక్షతో కొనసాగింప మొదలిడిరి. ఈసందర్భములే భారతజాతీయైక్యతకై బరితపించువారలకు విషాదము గలిగించును. ఏలనన నూతన స్థాపితముగు నైకమత్యమింకనుబలీయముకాలేదని వారలెరుంగుదురు. విరిగి ఔషధచికిత్సనుండి, యప్పుడే కట్లువిప్పబడిన యవయమునకు, మోయజేసిన బరువు నెత్తజనదు. ప్రతియపోహను ప్రతి వదంతిని నిజమని నమ్మకపోయినను, వేగమె తొలంగింప బడకపోయినయెడలగాని, నిజముకాదని రుజువు కాకపోయినయెడలగాని, దానివలన కల్గు హానినిమాత్రమును చులకనచేయజనదు. నిమ్నజాతులనుహిందూసంఘమున జేర్చుకొనుటమాత్రమేఅస్పృశ్యతానివారణోద్దేశముగాదనియు, ముందుగజరుగబోవు పోరాటములలో నిమ్నజాతులను హిందువులకు సహాయులుగ జేసికొనుటకే యీ యస్పృశ్యతానివారణోద్యమము బయలుదేరెననియు, కొందరు మహానుభావులు వదంతులు బుట్టించుచున్నమాట వాస్తవము. "దౌర్జన్యరాహిత్యము అసహాయోద్య[illegible]మున ముఖ్యభాగముగుటచే, దానిని ముఖ్యముగ గమనింపవల[illegible]యు"; వాక్క్రియలయందు దౌర్జన్యరాహిత్యము ప్రభుత్వముపట్ల నెంత యావశ్యకమో ప్రజలలో నొండొరులయెడకూడ నంతయే యవుసరమనుసంగతి, ప్రజలకు దెలియజెప్పవలయుననియు; దౌర్జన్యభావములు నిజమగు ప్రజాస్వామ్యతత్వమునకువిరుద్ధమగుటయేగాక, సహాయనిరాక



రణోద్యమ ప్రతిజ్ఞాపత్రికలోని తక్కటి యంశముల యాచరణకుగూడ భంగము గల్పించుననియు; మహాత్ముని యనుచరుల కుద్బోధించియుండ, ఇట్టి పరిస్థితులు వారికి సంతాపకారణము గాకుండునా? అస్పృశ్యతా కంటకమును నిర్మూలించుటలో దౌర్జన్యమునకు గడంగి, యిదివరకున్న దౌర్జన్యమును మరింత వృద్ధి యొనర్చితిమని మనల లోకము నిందించునెడల, మహాత్ముని హృదయము బరితపింపదా? మిత్రులారా! వారలకొదవిన కష్టముల నివారించుటకే నిమ్నజాతులతో చెలిమిజేయనగును. ఇతరులకు బాధకల్గించుటకుగాని, మనకుగల్గిన బాధలకై నితరులపై పగదీర్చుకొనుటకుగాని వారలతో మైత్రి యొనర్పకుడు.

సంఘటనోద్యమముయొక్క యింకొక లక్షణమేమనగ :— వ్యాయామసాధన యందెక్కువగ అభిలాషను గలిగించెను. ఇదంతయుమంచిదే. మనభారత ప్రజలలో నెవరినుండియైన స్తబ్ధతయు, పిరికితనమును వీడిపోయినచో, మనము సంతోషించవలసినదే. కాని, దీనిలోకూడ భావశుద్ధి గావలసియున్నది. క్రిందటిసెప్టెంబరులో ఢిల్లీలోజరిగిన హృదయపూర్వకమగు చర్చవల్ల అన్నిసంఘములయువకులకును పనికివచ్చు "అఖేడా" లు నిర్మించుట తనకును సమ్మతమేయని పండితమదనమోహనమాళవ్యాగారు లోకమునకు ప్రకటించుటకు అవకాశమేర్పడెను. ఇందుకు నాకు చాలసంతోషమైనది. మరియు ధనప్రాణాదులయొక్కయు—చెప్పుటకు నాకు విచారమగుచున్నది—సోదరీమణుల మానముయొక్కయు సంరక్షణార్థమై సామాన్యమగు స్థానికపౌరభటదళము నొకదానినినిర్మింపవలెనను తమమొదటియుద్దేశమునుకూడ మాళవ్యాగారు ప్రకటించిరి. తనయుద్దేశము ఒక్క హిందూసభచేతనే చర్చింపబడుటచే, అది అన్నిమతములను బాధింపవాలదను ఉద్దేశముతోనే మాలవ్యాగారు తమతీర్మానమును సవరించి, హిందూభటదళమును నిర్మించుటకు సమ్మతించెరు.

—:కాంగ్రెసు వారేర్పరచిన సమాధాన కమిటీ
యొక్క సంఘటనము:—

హిందూనాయకులతో పూర్తిగ నేకీభవించుచు, "హిందూమహామ్మదీ యైక్యసంఘము" వారు యీవిషయము లన్నిటిపై కొన్ని తీర్మానములను కాంగ్రెసు సభకు శిఫార్సుచేసిపంపిరి.

ఈతీర్మానములను కాంగ్రెసు తక్షణమేయంగీకరించినది. కావున వానిని మనమాచరణయందుపట్టించునట్లు చూడవలసియున్నది. ఐకమత్యమునకు భంగము గలుగకుండ నివారించుటకై మనము మొట్టమొదట ప్రతిజిల్లా కేంద్రస్థానమునందును జిల్లా కాంగ్రెసు కమిటీల యాజమాన్యముక్రిందను, ఖిలాఫతుకమిటీలు హిందూసభలు బాధ్యతగల ఇతర తత్స్థానికసంఘముల సలహాతోడను, మిశ్రమ సంఘములనేర్పరచి జిల్లాలయందంతటను శాంతి భద్రతలను గాపాడవలెను. ఇట్టిశాంతిభద్రతలకు భంగముగలిగించు నేసందర్భమైన తటస్థించినచో దానివల్ల కలుగు చెరుపును తగ్గించుటకై వీరు యత్నింతురు; సత్వరమును సంతృప్తికరమునునగు సమాధానమును కుదుర్చుదురు. ఎవరికైన క్రోధోద్రేకము గలిగినపుడు తగిన నిగ్రహముతో వర్తించుటకై పురికొల్పుదురు. తమయిబ్బందులను తీర్చుకొనుటకై తమంతటతామే దెబ్బలాడకుండ యీకమిటీల వద్దకువచ్చి చెప్పుకొనునట్లు చేయుదురు. అప్పటినుండియు కొన్నిజిల్లాలలో కాంగ్రెసుకమిటీలు పనిచేయుటయే మానివేసిన వనియు కొన్నిచోట్ల కాంగ్రెసులో పనిచేయువారే సంఘములమధ్య కలహముల పెంచుటకై నాయకత్వము వహించిరనియు వినుటకు నాకెంతయో సంతాపమును దుఃఖమును గలిగించెను. కావున జిల్లాకమిటీలు చేయుపనిని తనిఖీ చేయుటకై తనిఖీబోర్డులను కొంతకాలమేర్పరుపవలసి యుండును. అసలు జిల్లా కాంగ్రెసు కమిటీలే, లేనిచోట యీతనిఖీబోర్డే తత్స్థానమున పనిచేయుచుండును. ఇట్టిస్థిరమైన



రాష్ట్రీయబోర్డును భారతీయ సమాధానబోర్డును అవసరమని నాకుతోచుచున్నది. ఇట్టిబోర్డులే యిదివరకున్నచో సంతాపకరములగు కొన్ని కలహములుజరుగకుండ పోయెడివేమో మనమెంతజాగ్రత్తపడినను తప్పక జరిగితీరు సంఘటనములనుగూర్చి దరియాప్తుచేసి ముందుగ తెలిసికొనుటకుకూడ యీబోర్డులుపయోగపడవచ్చును. అవసరమైనచో దీనినిబట్టి నేరమెవరిదో తెలిసికొనుటకుకూడ అవకాశముండును. మనమీయేర్పాటుల నన్నిటిని చేసికొని సిద్ధముగనుందము; ఇట్టిపోకిరీతనమును మాపుమాపి శాంతిభద్రతలను, అంతర్జాతీయసౌహార్దవమును నెలకొల్పుటకు మనము బద్ధకంకణులమై యున్నామని ప్రజలకు తెలియగనే, యిట్టితగాదాలన్నియు మాసిపోవును. యీతగాదాలను తీర్పవలసిన అవసరమే మనకు తగ్గిపోవును.

"పౌరభటదళము"

దేశమునంతటను కాంగ్రెసుయొక్క స్థానిక సంఘములు తమ యాజమాన్యముక్రింద పౌరభటదళముల నేర్పరచవలసినదని ఢిల్లీకాంగ్రెసు తీర్మానించినది. ఈదళములలో అన్నిమతములవారు చేరవచ్చును. శాంతిభద్రతలగాపాడుటయు తదితర పౌరధర్మముల నెరవేర్చుటయు యీదళములయొక్క విధి.

ఇంతియగాక, స్థానికకాంగ్రెసు సంఘములు ప్రజలలో దేహపరిశ్రమ యందభిరుచిని వృద్ధిగావించి వారికెల్లవిధముల తోడ్పడునట్లు తీర్మానింపబడెను. ఈవిధముగ మనదేశీయులు స్వసంరక్షణ మొనర్చుకొనసమర్థులు కాగలరు. కొన్ని కులములవారు స్వంతముగ 'అఖాడా'లను పెట్టుకొనిరని వినియున్నాను గాని, కాంగ్రెసు సంఘములు కాంగ్రెసుపక్షమున పౌరభటవర్గములను, 'అఖాడా'లను నేర్పరచుటకు తగిన సావకాశము కలిగినటులగుపడలేదు. అజమీరునందుమాత్రమొక దేహపరిశ్రమ పాఠశాల గలదు. అందలి విద్యార్థులుకొందరు

ఢిల్లీ కాంగ్రెసుకు వచ్చియుండిరి. వారి శరీరసౌష్టవమునుజూచి సంతసించితిని. అంతకన్నను, వారి సుహృద్భావమున కానంద మొందితిని. స్థానికముగ నేర్పడిన హిందూమహమ్మదీయ కలహములలో, తమతమ సంఘములపక్షమున చేరి పోరాడుడని వారి నెంత వేడినను, వారట్లు కావింపక శాంతి ధర్మము నే యారాధించిరట. ఈవిషయమెరింగినవారెవరైనను, జాతీయైక్యత శాంతిస్థాపనములను కాపాడు విషయమున కాంగ్రెసు సంస్థలకు పలుకుబడి లేదని చెప్ప సాహసించెదరా? మన అర్జునలాలు సేఠీ, మౌలానా మొయినుద్దీను, మిర్జా అబ్దుల్ కాదరు బేగు గారలవంటి సత్పురుషు లెచ్చటనుండినను, అచ్చట నెల్ల శాంతియు నుండునని మనము విశ్వసింపవచ్చును. ఒక వేళ నశాంతి ప్రబలినను, సాధ్యమైనంత త్వరితముగ యథాప్రకారము శాంతి నెలకొల్ప వీలగును. ఐచ్ఛికభటదళముల నేర్పరచుటకై డాక్టరు హార్డీకరుగారు కృషి సల్పుచున్నందుల కెంతయు సంతసించుచున్నాను.

మిత్రులారా! నేడు నేనీకాంగ్రెసు సభాధ్యక్షత వహించుచుంటినను, నిజముగ 'హార్డీకరు' గారి స్థానమున నేనునిలచి పనిచేసినచో నా కెక్కుడుత్సాహకరముగ నుండును. మన దేశమునందు ప్రజలు గుంపులుగ చేరినపుడు మిగుల శాంతముగననే ప్రవర్తింతురు. కాని వారినింకను శాంతముగ నుంచవలెనన్నను, లేక నిప్పటికన్న విశేషముగ సుశిక్షితులొనర్పవలెనన్నను, పౌరభటవర్గము లెంత యుపకరించునో సర్కారువారు గ్రహించియున్నచో, ఐచ్ఛికభటులపైనను, వారిని సమకూర్చు నాయకులపైనను, విపరీతములైన క్రిమినలు చట్టముల నుపయోగించి యుండరు. దేశమున శాంతి భద్రతల వ్యాపింపజేయుటను గూర్చి సర్కారువారికి నిజముగ సదభిప్రాయముండినగదా పై యాలోచనలు వర్తించుట. ఈవిషయమున నాకొకింత స్వలాభాపేక్షయు కలదు. నిరంతరము ప్రయాణముచేయుచు అసంఖ్యాకములగు బహిరం-



గ సభల కేగుచు, దురదృష్టవశమున ననేకపర్యాయములు ఊరేగింపుటుత్సవములతో నాహ్వానింపబడుచుండు నావంటివానికి, సాధారణముగ నిల్లుకదలనివారికంటె పౌరభటవర్గప్రయోజనము బాగుగ తెలియగలదు. ఒక్కొక్కప్పుడు నాగౌరవార్థము ఊరేగింపుటుత్సవములు జరుగుచుండగనే, ఎవరి యుత్తరక్రియలందు వారు పాల్గొన వీలులేదను సంగతిని మరచి ఆపట్టణమందలి ఐచ్ఛికభటవర్గమునకు నేనే నాయకత్వమునవహించి వారిని నడిపింప నువ్విళ్లూరుచుందును.

—:మనపోకిరీల గౌరవభావములు:—

సంఘటనోద్యమమును వదలుటకు పూర్వము మనస్త్రీల గౌరవరక్షణమునుగూర్చి యొకమాట చెప్పెదను. ఇది నాభార్య చెప్పినదేగాని నాస్వంతమాట కాదని యొప్పుకొనుచున్నాను. ఆమె 'ఆల్మోరా' పట్టణమున హిందూస్త్రీలధికముగనుండిన యొకమహిళా సభయందు పన్యసించుచుండెను. ఆల్మోరాయందు మహమ్మదీయులు మిగుల స్వల్పసంఖ్యాకులు అట్టిప్రదేశమున నొకవేళ మహమ్మదీయులపై ద్వేషముచే వారిని హింసింపనొక యల్లరి ప్రారంభమైనచో తన్నును తన కుమార్తెను మానభంగము కాకుండ కాపాడుటకు తన పురుషబంధువు లెవరును లేనియెడల తప్పక మొట్టమొదట కాన్పించిన హిందువును —అతడుపోకిరీయైనను సరే— 'అన్నా'యని పిలచి, తన్ను తన పిల్లలను కాపాడుమని వేడియుందునని నాభార్య చెప్పెను. హిందూదేశమందలి పోకిరీలకు సైతము స్త్రీల మానసంరక్షణముపట్ల నున్నతభావములు కలవని యామె విశ్వాసము. భారతదేశమందెచ్చటనైనను సరే, ఆప్రకారము విపత్తునుండి కాపాడుమని వేడుకొనిన సోదరియొక్క మొర నాలకింపనేరని పోకిరీలు విశేషముగ నుందురని తలంచను. మిత్రులారా, ఆరుగుండ్ల తుపాకులు వ్యర్థమైనపుడుకూడ, కేవలము విశ్వాసమువలన దుడుకుతనమును జయింపగలము. కావుననే, మనకన్న మనుజస్వభావ

ము బాగుగ గుర్తెరిగిన షేక్స్పియరుమహాకవి ఇట్లు చెప్పెను:

“చెడుగునందుసైతము మంచితనముయొక్క ఛాయ కాన్పించును.” మనలో పరస్పర విశ్వాసమును పురికొల్పి, తమ విశ్వాసబలిమిచే మనలో నీచాతినీచులగువారియందు సైతము “మంచితనపుఛాయలను” వృద్ధినొందింప తోడ్పడుదురుగాక యని నా సోదరీమణులను ప్రార్థించుచున్నాను.

—:శుద్ధి:—

హిందూమహమ్మదీయుల స్నేహభావమును చెడగొట్టినమరియొక యుద్యమము ‘శుద్ధి’. ‘ప్రబోధకమత’మనిన నాకు గౌరవముకలదు. ‘ప్రబోధకమత’మనగా సత్యమును వ్యాపింపజేయుటయు, నమ్మకములేనివారికి నమ్మకముపుట్టించి వారిని మనలో కలుపుకొనుటయు, పవిత్రధర్మములనియుద్ఘోషించు మతములని నాయభిప్రాయము. ‘మార్పుమూలము’ పండితుని యభిప్రాయముకూడ నిదియే. సత్యమని మనసార నమ్మినదానిని మనోవాక్కాయకర్మములందు వ్యక్తపరచుటయు; ప్రపంచమునందలి ప్రతిజీవికిని తనసత్య సందేశమునుచాటి తాను నమ్మినదానినే మానవులందరును నమ్మినగాని తృప్తినొందజాలకుండుటయు, ప్రబోధమని లక్షణములు. క్రైస్తవ, బౌద్ధ మహమ్మదీయ మతములు ప్రబోధక మతములు. (Missionary religions) యూదుల పారశీకుల హిందువుల ధర్మములట్టివికావని సాధారణముగ నెంచబడుచున్నది.

హిందూమతమునుగూర్చి నా యసంతృప్తి కారణమిదియే. అలహాబాదులో 1907 సంవత్సరమున నుపన్యసించుచు హిందూమహమ్మదీయులలో భేదమిట్టిదని చెప్పితిని:—

“మహమ్మదీయులు కావించిన మహానేరమేమి? ఏదోచప్పిడి భోజనము తనవద్ద నుంచుకొని మహారాజార్హమని దానిని పొగడుచు ప్రపంచమందలి ఎల్లజనులు తనపదార్థములనే రుచిచూడవలెనని బల



వంతముగనైన వారినోట గ్రుక్కుదురనియేగదా! హిందువులన్ననో, తమపాకశాస్త్రపాండిత్యమునకు గర్వపడుచు ఎవ్వరికిని తెలియకుండ చాటుగ వంటయింట చేరి తోడిమానవులనీడయైన తమభోజనమునకు సోకకుండ ఒకకబళమైన నీయక భుజించుచున్నారు”

నేనీ విషయమును కేవలము పరిహాసముగ చెప్పియుండలేదు. తనమతములో నిట్టి వైపరీత్యముండుటకు సమాధానమేమి యని నేనొకపర్యాయము మహాత్మా గాంధీగారి నడిగితిని. హిందువులును తక్కిన మతముల వారివలెనే మతప్రబోధమేలచేయరని పరితపించిన నేను, నేడు నాహిందూసోదరులు చూపుచున్న మతవ్యాపకదీక్షను నిరసింతునా? అట్లొనర్చుట స్వవచనవ్యాఘాతము కాదా?

ఇంకొక్క నొక ముఖ్యవిషయముకలదు. మల్కానా రాజపుత్రులు నిజముగ మహమ్మదీయ మతసిద్ధాంతముల నేమియు నెరుగక హిందువులేయని అందరును తలచునట్లు ప్రవర్తించుచుండ, తమకోటి మహమ్మదీయుల స్థితిని గమనించి వారి నుద్ధరింపవలసిన బాధ్యతను గూర్చి ఇంతకాలముగనైన హెచ్చరిక యొసగినందులకు శుద్ధి సంస్కర్తలకట్టి మహమ్మదీయులు కృతజ్ఞులై యుండవలదా? మహమ్మదీయమతమునుగూర్చి యజ్ఞానమున మునిగియుండుటయేగాక, మహమ్మదీయాచారములనైనను సక్రమముగ నిర్వహింపని లక్షలకొలది తోడి మహమ్మదీయుల స్థితిని వీరు గుర్తింపకుండ నేలయుపేక్షవహించిరి?

ఉభయమతములవారును స్వీయమతములబోధించుటకును అవలంబించుటకును సంపూర్ణ స్వేచ్ఛయుండవలయును. ప్రపంచమున వేర్వేరు విజ్ఞానసాంప్రదాయములు కలవు. ప్రతి సాంప్రదాయమును వ్యాప్తి నొందించుటకే సర్వప్రయత్నములును జరుగగలవు. ఉత్తమమార్గములలో నేది యుత్తమమో మనబుద్ధిచాకచక్యమువలన గ్రహించి నిర్ణయించుకొనవలసిన స్థితియందున్నాము. ఒకానొక ధర్మము

నసహ్యించువారిని ధ్వంసమొనర్చుటవలన నాధర్మమును నశింపజేయు విపరీత పద్ధతి—నిష్ఫలపద్ధతిని మన మవలంబింప కోర్కె లేదు. స్పెయిను దేశమందలి (మతమున వేరు సిద్ధాంతముల నమ్మువారిని హింసించుటకై ఏర్పడిన) "ఇంక్విజిషను' పద్ధతులవంటివి రూపునాశన మొందినవని నమ్మెదను. భేదాభిప్రాయములు గలవారిని చంపి, భేదాభిప్రాయములనే చంపదలచువా రుండబోరు. నేటికాలమున నభివృద్ధి మార్గము వేరు. ప్రత్యక్షముగ, శాంతముగ, మన మతమునం దితరులను జేర్చుకొనవచ్చునుకాని, బుద్ధిపూర్వకముగ విచక్షణ గావించి మతమును మార్చుకొనవలసినదేగాని, బలవంత మెచ్చటను పనికిరాదు. మలబారునందు కొంద రుద్రేకపూరితులగు మోపళాలు, హిందూమత సూచకమగు జుట్టును బలవంతముగ గొరిగించి, మహమ్మదీయ మతములో కలుపుకొనినట్లు చెప్పబడిన మతవ్యాపకపద్ధతినిజూచి నిజమగు మహమ్మదీయు డెవ్వడైనను సంతసింపగలడా? ఐహికములగు వాంఛలను పురికొల్పి మతమునందు చేర్చుకొనుటకూడ, భగవంతుని దృష్టియందింతకన్న నుత్తమముకాదు.

జమీందారులును, షాహుకార్లును, హెచ్చు సంఖ్యగల మట్టువర్క ప్రజలును, పైరీతిగ బలవంతము పెట్టిరని యొకపక్షమువారును, అట్లు జరుగలేదని ఎదిరికక్షవారును, వివాదపడుచున్నారు. జాతీయైక్యత కిది మిగుల భంగకరము. ఆర్భాటసహితమును ఉద్రేకజనకమునునగు (బహుసంఖ్యాకుల మొత్తముగా కలుపుకొను) పద్ధతిని వీడవలయునను తీర్మానమును, ఏస్వల్పవిషయమున గలిగినకోపమువలననో, మంటగలిపిరి. అందువలననే ఢిల్లీకాంగ్రెసులోనియమింపబడిన హిందూసమాధాన సంఘమువారొక ముఖ్యతీర్మానమును సూచించిరి. దానినే కాంగ్రెసు ఆమోదించెను. 'శుద్ధి' యుద్యమమువలనను అందులకు వ్యతిరేకముగ బయలుదేరిన యుద్యమమువలనను, గలిగిన చిక్కులనుగూర్చి విచారించుట



కును; బలవంతము భయము అక్రమపు యొత్తిడి లోనగువానిప్రయోగించి కేవలము మతోద్ధారకోద్దేశమునకు వ్యతిరేకముగ ప్రవర్తించినట్లు ఏయేప్రదేశములనుండి ఆరోపణలు వచ్చెనో ఆప్రదేశముల స్వయముగ వీక్షించి, అట్టివిక ముందెన్నడును జరుగకుండు నట్లొనర్చుటకై, చర్యల నవసరములో సూచించుటకును; ఒకసంఘమేర్పాటుకావలెనని తీర్మానింపబడెను. పాశ్చాత్య దేశములందు ప్రతిరాజకీయకక్షవారును తమగౌరవముపట్ల నెక్కుడభిమానమును చూపుచు—లేని యభిమానమునైన నటించుచు—నుందురు. శాసనసభలో "అక్రమపు వర్తన చట్టము" అనుపేరిట లంచములు మొదలైన దురాచారముల మాన్పుటకై చట్టముల కావించెదరు.

మన యుద్యమము ఆధ్యాత్మికమైనదని విఱ్ఱవీగుచుందుమనము, మనగౌరవమును నిలువబెట్టుకొనుటకై మిగుల నభిమానపూరితులమై యుండవలెనుగదా. కేవలము చట్టముమూలమున చేయజాలకపోయినను, ఆచరణయందైనను, కాంగ్రెసువంటి జాతీయసంస్థ తన పలుకుబడిని వినియోగించి సర్వసంఘములును కొన్నినియమములను పాటింపవలెనని విధింపవలెను. ఉభయకక్షలవారును, ముందు పది సంవత్సరములకు రానున్న జనాభా లెక్కలనుదృష్టియందిడికొని, (మాసంఘములో ఎక్కువమందిగలరని చూపుటకు) పనిచేయుచున్నారేగాని భగవంతుని మాత్రము మరచిపోయినారు. అట్టి సందర్భములలో నాకు విసుకుజనించి, మన పూర్వీకులు తలలను లెక్కపెట్టుటకు బదులు (అనగా సమ్మతులను తీసికొనుట) తలలను నరుకుటచే తమ వ్యవహారములను పరిష్కరించిన మహాత్కాలమెప్పుడు మరలి వచ్చునాయని పరితపించుచుందును.

లోగొనుట లేమార్చుట.

రావిచెట్టు ఉసిరికచెట్టు ఊరేగింపులనుగూర్చిన పోరాటములు చిలిపివి. సాంఘిక పరిస్థితులను సరిగ సవరింపనిచో తగాదాకు కారణ

భూతముగాగల విషయ మొకటి యేర్పడును. ఇదేదనగ, హిందూసంఘము నిమ్నజాతులను తమలో త్వరగ నిముడ్చుకొనలేకపోయినచో వారు మతాంతరులై పోవచ్చును ఇదివరకే క్రైస్తవమిషనరీలీపనిని చురుకుగ చేయుచున్నారు. దానికై వారినెవరు నేమియు ననరు. కాని మహమ్మదీయ మిషనరీలు బయలుదేరినచో హిందువులందరును తక్షణమే గగ్గోలుపెట్టుదురు. మంచిపలుకుబడి గలిగినట్టియు ధనికుడైనట్టియు పెద్దమనిషియొకరు నిమ్నజాతులనుకలుపుకొనుటకై నాకొకమార్గమును చెప్పెను. హిందూనాయకులతోనొక యొడంబడిక చేసికొని దేశమున నేకభాగములుగ విభజించి కొన్ని భాగములలో మహమ్మదీయులును మరికొన్నింటిలో హిందువులును పనిచేయుచు సంవత్సరములోగాని అంతకెక్కువ కాలములోగాని తనమతములోనికి యెంతమంది నిమ్నజాతులను యిముడ్చుకొనుటకుగాని లేక తీసికొనుటకుగాని వీలుండునో అట్టి అంచనాలను తయారుచేయవలెను.

ఈసంఖ్య, ఆరూపసూచనలవారు చెప్పుకొనగల సొమ్ముమీదను, ప్రచారకులమీదను యిదివరకు యిముడ్చుకొన్న సంఖ్యమీదను ఆధారపడియుండును, ఈరీతిగ నిమ్నజాతులను తమలో నిముడ్చుకొనుటకు ఉభయసంఘములకు చక్కని స్వేచ్ఛయుండును. ఈమార్గము మాహిందూసోదరులెట్లు గ్రహింతురో చెప్పజాలను, అయినను నేను మనఃపూర్తిగా, నిర్మలమగు మనస్సుతో యీస్కీమును తాత్కాలికముగ వారియెదుట ప్రసాదించుచున్నాను. నేను చెప్పుచున్న దేమనగ: బరోడా సంస్థానములోనున్న "కాళీపరజులను" మధ్య రాష్ట్రములలోనున్న "గోండులను" చూచితిని. వారిస్థితిజూచినచో మనమందరమును సిగ్గుతో తలవంచుకొనవలసినదే, అదిమన కెంతయు అవమానకరముగనున్నది. వారిని హిందువులు తమలో నిముడ్చుకొనకపోయినచో, యితరులు యిముడ్చుకొందురు యిముడ్చుకొని తీరవలెను. అప్పుడు



పూర్వాచార, పరాయణులగు హిందువులుకూడ వారిని అంటరానివారినిగ చూచుటమానుదురు. మతాంతరులు కాగనే వారేమో తమవారుగా మారిపోయినట్లు గన్పట్టెదరు! అట్లయినచో, వారు మతాంతరులగుటకిది యెక్కువ ప్రోత్సాహము నిచ్చుటలేదా?

—:పత్రికలకర్తవ్యము:—

నేనింకొకమారు చెప్పునదేమనగా:—మతాంతరులనుగ చేయుటలో అందరికిని సుహృద్భావము ప్రబలుట అన్నిటికంటె యెక్కువైనట్టియు, తిరుగులేనట్టియు దివ్యౌషధమని మరల నొక్కిచెప్పుచున్నాను. కాని, యీసుహృద్భావము పత్రికలకున్నదో లేదో చెప్పజాలను. ఇప్పుడు మనదేశములో కొన్ని చోట్లనున్న పత్రికలు హద్దుపద్దులేక పాక్షికదృష్టితో పని చేయుచున్నవి. నేనుకూడ పత్రికాధిపతినే; పత్రికాస్వాతంత్ర్య సంపాదనకై పాటుబడుటలో నేనుకూడ కొంత కష్టమనుభవించితి ననుసంగతి తమకు తెలిసియేయుండును. పాపము:—గతించిపోయిన ముద్రికాశాసనము క్రింద పెట్టబడిన ప్రధానమైన కేసులో నేనుకూడ ప్రధానపురుషుడుగనుండు గౌరవము—అది గౌరవమేయైనచో—నాకు లభించినది. ఈనక్కను లేవగొట్టినది నేనే; కాని దానిని చంపివేయుకాలమందు నేను లేకపోతిని. ఈపై నిర్బంధములు కొన్ని పోయినవిగనుక మనమే యిప్పుడు యెక్కువ నిగ్రహముతో పనిచేయవలసిన యవసరము చాలగలదు. కాని, పంజాబులోని దేశభాషాపత్రికలను చూడగ, కాంగ్రెసువారందరును కలిసి దానిని సర్దుబాటు చేయనిచో, నిరంకుశాధికారులొసగిన ఆదిక్కుమాలిచట్టము మరలసమాధిలోనుండి లేచివచ్చిన బాగుండునురా యనిపించగలదు! ఆచట్టము మరల బ్రతికివచ్చినచో, దానిని వినియోగించుటకై పంజాబుపత్రికలలో అధికారులకు అవకాశము దొరుకుననిగాదు; ఏలననగ, పీనల్‌కోడ్డు **153 A.** సెక్షను క్రిందనేరమును, **124 A.** సెక్షను క్రిందనేరమును అధికారవర్గము వారిదృష్టిలో సమానములుకావు.

ప్రెస్సు యిప్పుడు గతించిపోయినను పీనల్ కోడ్డును, శివిలుకోర్టులును గవర్నమెంటుకు చాలును. ఈకోర్టులలో గవర్నమెంటుచేత పెట్టుబడిపెట్టబడిన ఉద్యోగస్థులు తమకు గలిగెనని చెప్పినయవమానములకై ప్రతిఫలమును పొందగలరు. కాని ప్రజలకొక్కరికే దిక్కులేదు. కాని ప్రజలనిట్టి దిక్కులేని స్థితిలోనుంచకుండ రక్షించుట మన పనియైయున్నది. క్రిందటి సెప్టెంబరులో యీపత్రికల విషయమై యొక తీర్మానమును కాంగ్రెసుకు శిఫార్సుచేయవలసినదని "హిందూ-మహమ్మదీయైక్య"సంఘమును ప్రోత్సహించినవాడను నేనే. భారతదేశములోని పత్రికలన్నిటికిని యొక హెచ్చరికపత్రమును పంపించునట్లువర్కింగుకమిటీకి ఆజ్ఞాపించవలసినదని మేము కాంగ్రెసును కోరితిమి. అందలి విషయమేమనగ:—

వివిధసంఘముల పొందికకు సంబంధించిన విషయములనుచర్చించునప్పుడు బహునిగ్రహముతో ప్రవర్తించుట అత్యావశ్యకము; మరియు; యీనానా సంఘముల తగాదాలను వివరించునప్పుడును వానిమీద వ్యాఖ్యానా వ్రాయునప్పుడును చాలనిగ్రహము జూపుట అత్యావశ్యకమని హెచ్చరించవలెను. భారతవర్షముయొక్క అత్యుత్తమ క్షేమమునకు భయంకరమై వివిధసంఘములకు పరస్పర ద్వేషమును పెంపొందించునట్టి ధోరణినవలంబింప వద్దనివారి నాపత్రికలో ప్రార్థింపవలెను. ప్రతిరాష్ట్రమునందును చిన్నకమిటీ యొకటియుండవలెను; సంఘములమధ్య కలహమును పురికొల్పగల యేవిషయమునైన యేపత్రికయైన ప్రకటించుచున్నట్లయిన అట్టిపనిని మానుకొనవలసినదని యీకమిటీవారా పత్రికను ప్రార్థింపవలెను. సుహృద్భావముతో చెప్పినయీమాటలను ఆపత్రిక వినకపోయినచో, దానిని బహిరంగపరుపవలెను.

అప్పటికిని వినకపోయినచో ఆఖరుకు కాంగ్రెసువారందరును ఆపత్రికను బహిష్కరింపవలెనని ప్రకటింపవలెను. ఈతీర్మానమును



కాంగ్రెసు ఆమోదించినది. కాని దానినింకను ఆచరణలో బెట్టుటకు కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమునకు తీరిక దొరకలేదు కాబోలు. హిందూమహమ్మదీయైక్యతను పునరుద్ధరించుటకు మనమిదిగాక యింకొకపనిగూడ చేయవలసియున్నది. అదిచాల అవసరము. కాంగ్రెసు క్రింద శాశ్వతముగనుండి పనిచేయుటకు తగినసిబ్బంది నేర్పాటు చేయవలెను. ప్రతిరాష్ట్రములోను ప్రతిజిల్లాలోను యిట్టిసిబ్బంది యుండితీరవలెను. కాంగ్రెసులో వట్టితీర్మానములను ప్యాసుచేసి గౌరవముగ సొమ్ము పుచ్చుకొనకుండ పనిచేయు కార్యనిర్వాహకులమీద వదలివేసిన లాభములేదు. జీతములిచ్చి శాశ్వతముగ కాంగ్రెసుక్రింద పనిచేయు సిబ్బందిని తగినంతమందిని యేర్పాటుచేయవలెను.

మిత్రులారా! మొన్నఢిల్లీలో చేసిన వానినే నేనిప్పుడు యిక్కడ మరల యేకరువుబెట్టి మిమ్ములను విసికించుచున్నానే గాని నేనిప్పుడు క్రొత్తగ చెప్పబోవు సంగతులేమియు లేవని మీరనుకొందురు కాబోలు. ఇదివరకు మనముచేసిన తీర్మానములను గట్టిగ కొనసాగించుటకు మనము కంకణము గట్టుకొన్నచో మనకిప్పుడు క్రొత్తగ కావలసినవి విశేషముండనక్కరలేదు.

ప్రస్తుత పరిస్థితులు మమ్ముల సంతృప్తుల జేయజాలవనియు నైక్యభావము గల్గియుండుటకు సంకల్పించుకొంటిమనియు. ఢిల్లీసభలో మనము లోకమునకు ప్రకటింపగల్గితిమి. దీనితో వాతావరణము కొంతవరకును జల్లబడెను. అదియె కాదు. జాతీయ వైషమ్యముల నడంచుటకు ప్రతిక్రియల గూర్చితిమి.

కాని దానినాచరణలోనికి దెచ్చుటకు మాకింకను సావకాశము లభింపలేదు. మనమింతవరకు ఢిల్లీ తీర్మానముల, బరీక్షించుటయును, వాక్యార్థము జేయుటయునును, విమర్శించుటయునును, చాల కాలము గడపితిమి. కాంగ్రెసు వాదులలో జా ంది ఎన్నికల (కౌన

నపళా) కొందరలోనుండిరి. జాతీయైక్యతను బునరుద్ధరించుటకు వే
రొండు మార్గముల నవలంబింపక పోవునెడల యిదివరకే యవలంబిం
చిన పద్ధతుల నాచరణలో బెట్టుట కార్యనిర్వాహకవర్గముయొక్క
విధియైయున్నది. కానిమీరలందరును సంకోచరహితులై వారికి తోడ్పా
టు నొసంగినగాని శాశ్వతఫలితము నొసంగు, కార్యము నద్దానిని
వారలు జేయజాలరు. నిక్కువముగ, మీరలే బలీయులగు మీకార్య
నిర్వాహకులు ప్రారంభమగు నూతన వత్సరమున మీయాజ్ఞల నిర్వ
ర్తించుటకు మీచే నియోజితులనైతిని. కాన మీయాజ్ఞా నిర్వహణ
మున మీ సేవకునికి తోడ్పాటొసంగెదరుగాక యని మిమ్ముల వేడు
చుంటిని.

ఈపరిస్థితుల గురించి కర్తవ్యమునకు గడంగెదరుగాక, యని
పత్రికా నిర్వాహకుల కందరకును, హృదయపూర్వకమగు విన్నపము
పు కొనుచున్నాను. పత్రికా సంపాదకుడనగు నాకు, ఆశాభంగము
గల్గింపకుందురుగాక. ఈమధ్య నేను బీజపూరునకు బోయి, నచట, తొ
సారి విఖ్యాతమగు గోపురమును దర్శించితిని. అద్భుతమగు కట్టడము
నుగాంచి నావలెనే యచ్చెరువొందుచున్న యొక మిత్రుడు గొప్పతన
మునకై పిరపిగు, ఐరోపాఖండమున నెచ్చటనైన, గోల్ గుమ్బాజు
నంటి ప్రతిధ్వనించు మహాభవనము లెచ్చటనైనగలవా యని, మెల్లని
కంఠస్వరముతో నన్నడిగెను. అంతటి మెల్లనికంఠస్వరముతో మాట్లా
డినను. యొకమూలనుండి యొకమూలకు నామిత్రుని పలుకులంత
విస్పష్టముగా వినబడుట మిక్కిలి యద్భుతవిషయము. ఒకమారుబల్కి
న, తొమ్మిదిసారులు ప్రతిధ్వనించుట మరియద్భుతమయ్యెను. నామి
త్రుడు బీజపూరుపట్టణ పూర్వవైభవమును దలంచుకొనుచు యొక్క
త్రుటికాలమున తన్మయుడయ్యెను. తన మహమ్మదీయ పూర్వులబుద్ధి
వైభవమునకును పనితనమునకును సగర్వుడయ్యెను. కాని యూరపు



ఖండమున ప్రతిధ్వనించు భవనము లింతకంటెను యద్భుతములని మర
లమెల్లని కంఠస్వరముతోనే బదులుజెప్పినతోడనే యాతడు తెల్లపో
యెను. ఐరోపాఖండమునందలి ప్రతిధ్వనించు గృహములు, పత్రికా
కార్యాలయము (నాల్గవశాఖ)లని నేను నుడివితిని పత్రికా నిర్వాహ
కుని యేకాంతమందిరమున రహస్యముగావిడచిన యెట్టియనృతంపుమాట
యైనను ఖండ ఖండాంతరములకు వినబడునట్లు ప్రతిధ్వనించును. పిమ్మ
టయయ్యదియే. సహస్ర సంఖ్యాకుల నోటినుండి వెలువడి మహాధ్వ
నియగును. వాస్తవము నెవ్వరును విమర్శించుకొనరు. అసత్యధ్వానము
లచే ప్రపంచమును మారుమ్రోయించుట యెంతసులభమో సత్యగర్జ
నలచే. ప్రతిధ్వనింపజేయుటకూడ నంతసులభమే. భారతవర్షమునంగల
పత్రికా కార్యాలయములు సత్యమును ప్రతిధ్వనించు భవనములు
గానున్నవో, అసత్యము మారుమ్రోగించు గృహములుకానున్నవో,
అయ్యదియే యేనిర్ణయించుకొనవలయును.

## స్వరాజ్యము–అన్యదేశీయుల దౌర్జన్యము.

హిందూమహమ్మదీయ సమస్యనుగూర్చి ముచ్చటించుట విర
మింపకపూర్వము నేనొక్క మాటజెప్పి విరమించెదను. స్వరాజ్యము
చేకూరునెడల భారతవర్షమున హైందవమహమ్మదీయుల మతవాం
ఛల నన్నిటిని దీర్చి వారల సంతృప్తుల జేయునని నేను వక్కాణించు
చున్నాను. స్వరాజ్యము సర్వరాజ్యము. అందరిరాజ్యమును స్వరాజ్య
మున స్వధర్మ మిమిడియున్నది. ప్రాచ్యదేశమున నట్లె యుండవల
యును. ఢిల్లీనగరమున మొగలాయి సింహాసనమును ముసల్మానులే
యధిష్టింప నవుసరము లేదు. తురుష్క మహాసామ్రాజ్యము సింహా
సన విహీనమై ప్రజాస్వామ్యముగ బరిణామమొందుట మనము జూచి
యేయుంటిమి. మహమ్మదు సంతతివారగు ఖలీఫాలు ప్రజాసేవకులై
ముప్పది వత్సరములు సత్పరిపాలన మొనర్చిరి. వారలదలంచి యేమ

హమ్మదీయుడు గర్వపడడు? నాగరకత ప్రపంచమున చాలభాగము మహమ్మదీయ మతమును వ్యాపించెను. అప్పటికి గనిపెట్టబడిన ప్రపంచములోని అన్ని ఖండములలోను మహమ్మదీయసామ్రాజ్యము విస్తరిల్లెను. కాని తరువాతి మహమ్మదీయ విజయములును, తరువాతి సామ్రాజ్య విజృంభణములును మహమ్మదీయులకు మొదటి ముప్పది వర్షములలో జేకూరిన విజయపరంపరలంత ప్రశంసాపాత్రములుగావు బైజాంటైను ఐరానియను సామ్రాజ్యముల నుండి యరుదేరిన రాయబారులు తమతమ యేలికల నిరంకుశాధికారములను గూర్చి బడాయి గొట్టుచుండ మహమ్మదీయ రాయబారి తమ యేలికను తామే నియోజించితిమనియు ఈశ్వర ధర్మమును ద్రోసిపుచ్చునెడల తక్షణమే యాతని పదభ్రష్టుని జేసెదమనియు సగర్వముగ బలికినదీకాలముననే దైవభీతిగలట్టియు, శౌర్యవంతులైనట్టియు తురుష్కులు హతాశులై ఓటమి జెందుటకు సిద్ధముగానున్నపుడు విజయమును బడయుట వృథగాదు. విజయానంతరమున అనివార్యముగ గల్గు కార్యములు దీరినపిమ్మట ఈశ్వరసహాయమును గొని ఓమరైనను, అబ్బసైను సామ్రాజ్యవైభవములగాక రాజులులేని కాలమగు ఖిలాఫతుకాలమునాటి వైభవములనే మరల నెలకొల్పెదరు.

ఖిలాఫాకును తక్కటి మహమ్మదీయ రాష్ట్రములకునుగల సంబంధమెట్లు నిర్ణయింపబడవలయునో యీవిషయమును గూర్చి, నాకు కొన్నియభిప్రాయములుగలవు కాని ముచ్చటించుటకిది సమయముగాదు.

భౌతికవిషయములలో పరిపాలకు డెవడైనను, యీశ్వరుని ప్రభుత్వముదప్ప వేరొకని ప్రభుత్వములేదనియు ఆయనను సేవించుటకే మనమాజ్ఞాపింపబడితిమనియు, గుర్తించునెడల తమ మతవాంఛల నన్నిటిని దీర్చుకొనగలరని నా మహమ్మదీయ సోదరులకు నేను మనవి



చేయుచున్నాను. అన్నిమతములలో వలెనే మహమ్మదీయ మతమునందుగూడ, ప్రతిమహమ్మదీయుడును తప్పక జేయవలసిన కార్యములుగొన్నియు, తప్పక చేయతగని కార్యములు గొన్నియు గలవు. ఈ చేయదగినపనులకును, చేయదగని పనులకును మధ్య విశాలమగు భూమిగలదు అందు యాతడు దనయిచ్చవచ్చిన తెరంగున విహరింపవచ్చును.

చేయదగిన కార్యముల చేయవలదనిగాని, చేయదగని కార్యముల చేయవలసినదనిగాని యాజ్ఞాపించు మనుష్యమాత్రునికి వశవర్తులై ముసల్మానుడెవ్వడును మెలంగజాలడు. అట్టిమానవుడు, తనకుటుంబములోనివాడైనను, పరిపాలకుల లోనివాడైనను, యజమానునకు జోడినవాడైనను, స్నేహితుడైనను విరోధియైనను మహమ్మదీయుడైనను మహమ్మదీయేతరుడైనను సరే మతేతర విషయములందు మహమ్మదీయుల రాజ్యాధికారమునకు భంగము రాకుండునంతకాలము అట్టి రాజ్యాధికారము ఖలీఫా చేతియందుండు నంతకాలము, మహమ్మదీయులు మహమ్మదీయ పాలనకు లోబడినను మహమ్మదీయేతరుల పాలనకు లోబడినను సరే విచక్షణలేదు. మహమ్మదీయులు గోరునది తన మతవిషయములందు తమధర్మసూత్రముల నిర్వర్తించుటకు స్వేచ్ఛమే. మహమ్మదీయ నృపాలుడైనను సరే, ఖలీఫాయైనను సరే, యీశ్వరునికి జోహారులర్పవలదని శాసించునెడల, అట్టియాజ్ఞ నుల్లంఘింపవలెను. మహమ్మదీయ ప్రభువున కొసంగజాలనిది మహమ్మదీయేతర ప్రభువున కొసంగజాలము. ఏలనన, అయ్యది ప్రభువుకొసంగ బడునదిగాదు. ఈశ్వరునికొసంగవలసినది. ఇట్టివిషయములో స్వరాజ్యస్వధర్మ ప్రభుత్వమునకు, హృదయపూర్వకమగు భక్తివిశ్వాసముల నెందులకు జూపకూడ నాకు దెలియకున్నది.

భారతీయ మహమ్మదీయుల సహాయమునుగొని ఆఫ్ఘనిస్థాన ప్రభువగు అమీరుగారు హిందూదేశముపై దండెత్తువత్తురను అనవసర

మగు భయమునకు కేవలము పిరికిదనమును భీతియే కారణములు. దాని
నిని గెలువవలెనన్న ధైర్యము బూని యాత్మనిగ్రహము వహింపవలయు.
జవాహరలాల్ గారు "స్వరాజ్యప్రాప్తి నంతరము మనపై కెవరు దండెత్తి
రో చూతము" అని చెప్పిన వాక్యములు చదివినపుడు నా హృదయమున నా
నందము జనించెను. అట్లే జరిగిన యెడల నిజముగ నెవరు వచ్చినను మన
కు భయము లేదు. 150 వత్సరముల దాస్యానుభవము తరువాత కష్టప
డి స్వాతంత్ర్యమును సంపాదించిన వారి చేతులలోనుండి దానిని లాగికొ
నుట సామాన్యకార్యము కాదు. అట్లు దండెత్తి వచ్చునది హిందువైనను
మహమ్మదీయుడైనను వాని నెదుర్కొనవలసి వచ్చిన యెడల నెవరిని
మీరిప్పుడు గౌరవించెదరో అట్టి నేను నా యధాశక్తి పోరాడుటకు సం
సిద్ధుడనై యొక సైనిక పదవి నాక్రమించుకొనుటకు సిద్ధముగా నున్నా
ను. నేనెన్నటికిని మిమ్ముల ద్రోహము చేయను.

అఫ్ఘనిస్థానము.

1921 సంవత్సరమున నేను చెన్నపురిలో నిచ్చిన యుపన్యాస
ము అధికారివర్గముచే మిక్కిలి రాజద్రోహపూరితమని తలపబడుచు
న్నది. అందు బేటూలు చెరసాలయందుండి నేను మా సోదరుడును కలసి
వైసరాయిగారికి వ్రాసిన యుత్తరములో ఏ విషయముల వ్రాసితిమో
సరిగా యవియే చెప్పబడినవి. ఆయుపన్యాసము అఫ్ఘనిస్థానమునందు గూడ
గౌరవపాత్రము కాలేదు. మనము పలుమారు వారికి మనపై దండెత్తి
వచ్చు నభిప్రాయమున్నదనుట విని వారికి కొంచెము కోపము కూడ
వచ్చియుండుట వింతకాదు. అఫ్ఘను అమీరుగారు విదేశీయ సాహాయ్య
ము లేకయే తన రాజ్యమందు కట్టుబాట్లను చేయుటయు ఉన్న శక్తులను
వినియోగపరుచుకొనుటయు జరిపించుట వినినయెడల మనకు అఫ్ఘను
వారు దండెత్తుటయను నభిప్రాయమే యుండకుండును. ఆయనకును నా
యన ప్రభుత్వమునకును ఉన్న కాలము తన దేశమునందలి వ్యవహారముల కొ



రకే సరిపోవగలదు. భారతదేశముపై దండెత్తా జేయుచుట యెట్లాయను
విషయమునకు కాలము చాలదు. అఫ్ఘనిస్థానము దండెత్తు వచ్చిన నిట్లు
చేయుదమని నేను చెప్పిన యూహచేతనే వారికింత కోపము వచ్చిన యెడల
నట్టి విషయము చర్చించుటకు నాకెంత కష్టముగ నుండవచ్చును. నేను మ
హమ్మదీయుడనగుటచే నా భారతీయత్వమునకు హాని రాలేదు. అట్టిచో
తమ దేశము యెంత బలహీనమైనదైనను విదేశీయరాజు యొక్క ముట్ట
డికిలోనై సులభముగ కబళింపబడునను కొనుట మన జాతికెంత యవ
మానమో మీరే యూహింపుడు?

"నాల్గవ వారు నన్నే కొట్టగలరు"

సోదరులారా! మన ప్రస్తుత స్థితిని పోల్చుటకు
సరిపోయిన యొక కథను చెప్పుచున్నాను. క్షమింపుడు. ఆ క
థావక్త మెవ్వరో కాని నిశ్చయముగ మన కాలము నాటికి మిక్కిలి
ప్రాచీన కాలమున వరలినవాడు. ఏలన కోమటి పిరికివాడని చెప్పె
ను. నా వైశ్య స్నేహితులు నన్ను మన్నింతురుగాక. ఈ కాలమున వైశ్యు
లను గూర్చి యట్లు చెప్పుటకు వీలులేదు. ఏలన ఇటీవలి కాలమునందలి
భారతీయ నాయకులలో సత్యవ్రత సుధైర్యశాలియగు గాంధిమహాత్ము
డును ఆయన ముఖ్యానుచరులలో నొకడై ఆయనకు ప్రియమైన
వాడగు సేటి జమ్నాలాలు బజాజీగారును వైశ్యులే. శ్రీ బజాజిగారిని
నేను "నా వైశ్య స్నేహితుడ" ని పిలుచుచుందును. ఒక కాలమున నలుగురు
బాటసారులు మార్గమధ్యమున కలసి నిర్భీతికొరకై యందరును కలసి
నడుతుమని నిర్ణయించుకొనిరి. ఒకనాడు సాయంకాలమున వారు బంది
పోటు దొంగలచే పట్టుబడిన వారు వారివద్దనున్న వస్తువులన్నిటి నియ్యుమని
బలవంత పెట్టిరి. అప్పుడు దొంగలు కూడ నల్గురేయని తెలిసికొనిరి.
వారిలో నొక రాజపుత్రుడు తోడిపఠానుతో దొంగలలో నెల్ల బలవం
తుని తానుకడ తేర్చగలనని రహస్యముగ ననెను. పఠాను స్నేహితుడు

ప్రత్యుత్తర మొసంగుచు తరువాతి బలవంతునితో పోరిగెలువగలనని చెప్పెను. మధ్యవయస్సునున్న మూడవవాడు బ్రాహ్మణుడుగావున "మూడవవాని నేనుక్రింద పడవేయగలనని యనెను. అంతట నాల్గవవాడైన కోమటివంతువచ్చెను. వాడు వెంటనే "నాల్గవవాడునన్నే కొట్టగలడ"ని వాక్రుచ్చెను. అట్టితరి తాను మొదటవలె యొక్కనితోగాక యిద్దరిలో పోట్లాడవలసి వచ్చునని బ్రాహ్మణుడు వెనుదీయుటకు నిశ్చయించుకొనెను. పఠానుడు కూడముగ్గురితో పోరాడవలసియుండునని వెనుకకు తగ్గెను. రాజపుత్రుడుకూడ నలుగురితో గెలువలేనందున దొంగలకు లోబడెను. మిగిలిన ముగ్గురును ఒక్కొక డొక్కొకని గెలువగలనని నెంతధైర్యముతోనుండెనో నాల్గవవాడు నాల్గవదొంగ తనను కొట్టగలడని అంతనమ్మకముతో నుండుటచే నింతమూడెను !

—:ధైర్యమును, నమ్మకమును నుండవలెను:—

సోదరులారా! ఇప్పుడు వైశ్యుడే మన నాయకుడగుటచే, యుద్ధము మొదలిడుటకు పూర్వమే యపజయమొందెదమను నభిప్రాయమును వీడుటకు తగిన సమయమురాలేదా. ఇటీవల యిద్దరు వృద్ధులును నొక యువకునునగు అరబ్బులు జరూసలెములోనున్న బీర్ మహమ్మదీయ దేవాలయములను, బాగుచేయుటకై ధనము సేకరించుటకు ప్రభుత్వముయొక్క యనుమతితో రాయభారముగ వచ్చియుండిరి. వీరుముగ్గురునుహిందూదేశముపై దండెత్తివచ్చుచున్న యారబుసేనలోని ప్రథమభాగమని తమ రహస్యవిలేఖరిచే తెలుపబడెనని యొక ఢిల్లీ వార్తాపత్రిక వ్రాసెను. ఇట్లు భయపెట్టుటచే స్వరాజ్యమును సంపాదింపజాలము. ఇదియే మనకున్న కొంచెమునుకూడ కోల్పోవుటకు మార్గము. ఈవ్యవహారములుచూడ బైబిలునందలి, యూదులకు భగవంతుడిచ్చిన శాపము జ్ఞప్తికి వచ్చుచున్నది.



—:తురుష్క సందేశము:—

ఇపుడు మహమ్మదీయులకు రెండువిధములైన కర్తవ్యములుకలవు. వారు భారతీయులేగాక వారు భారతదేశీయ స్వాతంత్ర్యసంపాదనము కొరకు పాటుపడుట వారికర్తవ్యము. భారతదేశమొక్క హిందువులదేకాదు. అందువలన నట్లుజరుగుట యసంభవమైనను, నొకవేళ హిందువులు తత్సంపాదనమునకు వలసిన త్యాగమును చేయుటకు వెనుదీసినను, మిగిలిన భారతీయులందరి సాహాయ్యములేకయే తామొక్కరే స్వరాజ్యమును సంపాదించెదమని చెప్పి పాటుపడుట వారికర్తవ్యమై యున్నది. వారు మహమ్మదీయులగుటచేకూడ వారు స్వరాజ్యసంపాదనము కొరకై పాటుపడవలయును. పారిసునందును, స్విట్జరులందునందును, రోమునందును తురుష్కుల కొందరను నేను కలసితిని. మహమ్మదీయు లధికసంఖ్యాకులుగగల సేనలను తమపై పోరాడుటకు పంపినను, వారిపరాజయము తరువాత వారికి సంధిసౌకర్యములు కలుగజేయుటకు రాయబారము నంపుట వారికత్యాశ్చర్యమును గొల్పెను. తురుష్కుల కత్తులకుగాని జర్మనుల ఫిరంగులకుగాని భయపడని భారతీయ మహమ్మదీయులలో చాలమంది యుద్ధకందకములను కత్తులబోనులలో నెలలు సంవత్సరములుండు ధైర్యమున్నను, పోలీసువాని కర్రయన్నను, కారాగృహములన్నను భయపడుదురని పరస్పర వైరుధ్యమును విప్పిచెప్పితిని. అదివిన్నంతనే నాతురుష్క స్నేహితులట్లైన తమకు రానున్న దాస్యమును గాకుండచేయుటకు పూర్వము, వెంటనే యోడలో భారతదేశమునకు వెడలి స్వదేశదాస్యశృంఖలా విచ్ఛేదనము గావింపుమని నన్ను హెచ్చరించిరి. వారిట్లనిరి:—

"టర్కీయందును, జలసంధియందును నింగ్లాండునుజయించితిమి. పాలస్తినాలోను, మెసపొటేమియాలోను మాకు మిక్కిలి యొత్తిడి కలుగజేయుచున్న మీభారతీయ సేనలను నేమాపజాలకున్నాము

మీరు స్వతంత్రులై, ఖిలీఫా సేనలపై పోరాడుటకు మహమ్మదీయులు లాగికొని పోబడుటకు వీలు లేకున్నయెడల టర్కీయును ముసల్మానుమతమును క్షేమముగా నుండగలవు. మీస్వదేశమున స్వాతంత్ర్యమును సంపాదించుట మాకును మీకునుకూడ క్షేమకరము. మీ హిందూసిక్కు సోదరులు తమకొక్కరికే స్వరాజ్యమవసరమనియు మీకొరకై యవసరము కాదనియు తలంచకుందురుగాక! వారి నంత సంపూర్ణదాస్యమున నుంచుటకే మనను బాధింపవలెనని ప్రయత్నించుచున్నాడు.”

—:ప్రాచ్యరాజ్య సమ్మేళనము:—

సోదరులారా! నాహిందూ సోదరనాయకులనేకులు ఇతర ప్రాచ్యరాజ్యములతో కొంతసంబంధము కలుగజేసికొనుటకు ప్రయత్నించుచున్నారని వినుటకు సంతసమగుచున్నది. వారి రాజకీయాభిప్రాయము లుత్తుంగ హిమాలయ శిఖరములను గభీరసముద్ర వైశాల్యమునుదాటి వెలికినడచినది. ప్రతిప్రాచ్యముయొక్క స్వాతంత్ర్యము స్వస్వాతంత్ర్య సంపాదనమునకు సాయముచేయగలదనియు, వానినన్నిటిని సమ్మేళనము చేయవలయుననియు నభిప్రాయపడుచున్నారు. అవ్వత్సరములో గాంధిమహాత్ముడు ఖిలాఫతు సమస్యతో నేకీభవించినపుడు యీయభిప్రాయమునకు పునాది వేసెను. హిందువులిట్లు ప్రాచ్యరాజ్య సమ్మేళనముకొరకు పాటుపడుచుండ మహమ్మదీయులు సహారాన్పూరులోని యల్లరులు స్మర్ణాయందలి రంగములతో పోల్చవచ్చునని చెప్పెడియొక్క పత్రికావిలేఖరయొక్క వాక్యములగాని హిందువులతో సహకారమొనర్పకుండుట బహుచిత్రము! ఇంతకంటె హాస్యాస్పదమును, యసంభవమును, వేరొకటికానరాదు! తురుష్కులీ పోలికను వినినయెడల మనలనుగూర్చి యెక్కువగ కృతజ్ఞత బూనుదు రనుకొనుట పొరబాటు.



—:ముసల్మానులకొక యంత్యప్రశ్న:—

సహారాన్పూరులో హిందువులే యెక్కువ బాధల ననుభవించిరి. కాని యీసహారాన్పూరు అల్లరులను సహాయనిరాకరణమును సహకారమునకువచ్చు కారణముగగూడ చెప్పెడువారి నొకప్రశ్న యడుగుచున్నాను. “ఇట్టి యకారణమైన బాధలను బ్రిటిషు ప్రభుత్వముండగనే ముసల్మాను లనుభవింపలేదా?” ఇదియే నాప్రశ్న. అప్పుడు మాతలపాలనుండు హిందువా, లేక యసహాయోద్యమమునందు పాల్గొనుచున్న మహమ్మదీయుడా? తుదకప్పటి న్యాయాధికారి ముసల్మానుడా కాడా? ఆయన సంఘమూఢుడై తననాయకత్వమును కోల్పోయి విదేశీయ ప్రభుత్వముతో సహకారమొనర్పలేదా? ఇవిమూడును ప్రత్యేక ప్రశ్నలు కావు. అంతయు నొక్కటే ప్రశ్న. ప్రభుత్వమువారును వారికి సహాయము చేయువారును, సహారాన్పూరునందలి మహమ్మదీయుల సంరక్షింపజాలనపుడు, అట్టి సహకారము నింకను సార్వజనికముచేయు ప్రయత్నము లొనర్చిన సంతకంటెవారు సురక్షితముగ నుందురని పూని యెక్కడకల? ఇదియే ప్రశ్న! నేనాతయాగిన నీ ప్రశ్నకు ప్రత్యుత్తరము రాదని నాకు నమ్మకము కలదు.

అవి యట్లుండ ముసల్మానుల పవిత్రక్షేత్రములు మహమ్మదీయేతరుల పాలననే యున్నవి. తప్పక యైదుమారులు భగవద్ధ్యానము నొనరించు ప్రతిమహమ్మదీయుడు పవిత్రమైన(కాబా) మెక్కానగరమువైపునకు తిరుగుచున్నాడు. నేను బీజపూరు చెరసాలలోనున్న కాలము నాహృదయమున కొకవిషయముతట్టి యొక్కప్రశ్నను పద్యమున వ్రాసితిని. దానికింక నెవ్వరును ప్రత్యుత్తరమిచ్చియుండలేదు.

“మనము ప్రతిదినమునను ధ్యానించుటకే కాబావైపునకుతిరుగుచున్నాము. అట్టి కాబానగరము శత్రుహస్తమైనందుల కాయనకు

మనమేమని ప్రత్యుత్తరము నొసంగగలము?"

యుద్ధానంతర సందర్భములు.

సోదరులారా! హిందూమహమ్మదీయ సమస్యనుగూర్చి నేనెంత చెప్పగలనో యంతయును చెప్పితిని. ఇంత విపులమైనచర్చచేతను మనలో మనకు పరస్పరసహాకారము యొక్కయు విదేశీయప్రభుత్వమున సహాయము యొక్కయు యావశ్యకతనుగూర్చి నేను వారిహృదయములనమ్మింపలేకపోయిన యెడల నేనే యోడిపోయినట్లొప్పుకొనవలసియున్నది. ఒక్కవిషయము మాత్రము నిశ్చయము. ఇప్పుడింత యాలస్యమున హిందువులనుండి మహమ్మదీయులుగాని మహమ్మదీయులనుండి హిందువులనుగాని తప్పించుకొనజాలరు.

హిందువులెవ్వరైన నట్టియుద్దేశ్యము గలవారున్న నట్టితరుణము, 1200 సంవత్సరములక్రిందట సింధుదేశమున మహమ్మద్ ఖాసీ మడుగిడిననాడే వెడలి పోయినదని నమ్మవలెను, అప్పుడు ముసల్మాను లల్పసంఖ్యాకులు. ఇప్పుడన్ననో యేడుకోట్లవఱకు వారిజనసంఖ్య వృద్ధియైనది. ఒకవేళ ముసల్మానులకూడ నట్టియభిప్రాయమేయున్న యెడల వారికికూడ తరుణము పోయినది. ఆసేతు హిమాచలము వారేకచ్ఛత్రముగా నేలినప్పుడొక్క హిందువైనలేకుండ నాశనము చేయవలసియుండును. ఒకపారశీకసామెత చెప్పినట్లు యుద్ధానంతరము మరల పోట్లాడుకొనవలసివచ్చిన నెవరిచెంపలు వారుకొట్టుకొనవలసియున్నది. ఒకరినొకరు నశింపజేయ లేనప్పుడు ఒకరికొకరు సహాయముచేసి వైషమ్యములను పరిష్కరించుకొనుటయే ముఖ్యావసరము. కావున మహమ్మదీయులు స్వరాజ్య సంపాదనము స్వార్థముకొఱకు మాత్రమేకాక శత్రునిరోధమునకని హిందువుల ననుమానము పోగొట్టవలయును. హిందువులు తమయధికసంఖ్యాకత్వమును మహమ్మదీయుల దాస్యముకొఱకుపయోగించుట లేదని వ్యక్తీకరింపవలయును. ప్రత్యేకముగ నన్నడిగిన, ప్రస్తుత



దాస్యమును వీడి విదేశీయునకుగాక హిందువు ఖామందుగాగల దాస్యమునొప్పుకొనుటకు సంసిద్ధుడనై యున్నాను. ఏలయిన యిట్టిమార్పువలన 25 కోట్ల నాదేశీయుల దాస్యమునైన నడ్డగించిన వాడనగుదును. వారుకూడ దాస్యమున నున్నారనిన, పాశ్చాత్య సామ్రాజ్యము మనపై నవిచ్ఛిన్నముగ పారుచున్నదనియే కదా! యర్థము! 1916 సంవత్సరమున మన నాయకాగ్రేసరుడైన కీ॥ శే॥ బాలగంగాధర తిలకు గారితో మహమ్మదీయులకు సౌకర్యము లెక్కువగ నొసంగుచున్నారని తెల్పినపుడు ఆయన "మనమెన్నటికి వారికెక్కువ యీయజాలము"ని చెప్పినవాక్యముల నెంతయర్థమును దూరదృష్టియు కలవు. హిందువులు నైక్యమును తలపెట్టుచుండగనే హిందూమహమ్మదీయ మైత్రిని చెప్పుట దౌర్బల్యసూచకమని నాతోచెప్పు ప్రతివానికిని "హిందువులతో వ్యవహరించునపుడు దౌర్జమనునదియే లేదని" నేను ప్రత్యుత్తరమియ్యవలసియున్నది. దుర్బలులే యితరులకు దుర్బలులుగ కనబడుటకు భయపడుచుందురని నమ్మవలసియున్నది. ఏసమస్యను సంపూర్ణముగ పరిష్కరించని మనమేమియును చేయజాలమో యట్టివిషయము నీమాటలతో విరమించుచున్నాను.

—:కౌన్సిలు ప్రవేశము:—

ఢిల్లీలో ప్రత్యేకకాంగ్రెసుసభ శాసనసభా ప్రవేశమును పరిష్కరించుటకై సమావేశమైనను, అచ్చట చర్చింపవలసిన ప్రధానవిషయ మీహిందూమహమ్మదీ యైక్యతయేయైయుండెను. నేనిప్పుడు విశేషభాగము హిందూమహమ్మదీ యైక్యతనుగూర్చియే చెప్పితిని, కారణమేమనగ:—అది ప్రధానమైన విషయమగుటయేగాక రెండవదియగు శాసనసభాసమస్య మన అదృష్టమువల్ల యిప్పటికంతరించినది ఢిల్లీలో నాప్రార్థనమీద కాంగ్రెసుసభ శాసనసభలపై ఆంక్షనుతీసివేసి, మతసంబంధమైనట్టిగాని మనస్సాక్షి సంబంధమైనట్టిగాని అభ్యం

తరములు లేనివారు అప్పుడు జరిగిన యెన్నికలలో వోట్లివ్వవచ్చుననియు, శాసనసభలకు నిలువవచ్చుననియు అనుజ్ఞనొసంగినది. మరియు మూడుసంవత్సరములక్రింద అంత జయప్రదముగ జరిగిన శాసనసభా బహిష్కార ప్రచారమును నిలిపివేయవలసినదని కూడ ఢిల్లీకాంగ్రెసు చెప్పినది. ఎన్నికలు పూర్తియైనవి. సంవత్సరకాలమునకుపైగా మన పనినంతను పాడుబెట్టి మనలో సహనమును పోగొట్టి నానాభ్రష్టము చేసిన యీసమస్యను తిరిగి రేపుటవల్ల ప్రయోజనమేమియు నుండదని నాబుద్ధికి తోచుచున్నది. త్రివిధ బహిష్కారమునుగూర్చి నాకెక్కువ కట్టుదలయున్నది. దానినిగూర్చి నేను ఢిల్లీవిషయ నిర్ధారణసభలో తీవ్రముగ—మాస్వరాజ్యపార్టీ స్నేహితులు చెప్పినట్లు అతితీవ్రముగకూడ—మాట్లాడితిని. నాకిప్పటికిని ఆయభిప్రాయములే యున్నవి. అవసరమని నాకుతోచినచో, యిప్పుడుకూడ నేనంత తీవ్రముగ నేమాట్లాడుదును. దేశాభ్యుదయమునకును కాంగ్రెసుయొక్క పురోగమనమునకు నిది తోడ్పడునని నాకుతోచినచో, నేనుతిరిగిఅంతతీవ్రముగ నే యీఆరోజునకూడమాట్లాడుటకు సిద్ధముగనున్నాను. కానియిప్పుడట్టి యవుసరమున్నట్లు నాకునచ్చలేదు. స్వరాజ్యపార్టీ వారి యభిప్రాయములును నాకునచ్చలేదు. అదిగాక ఏమాత్రము దేశాభిమానముగల భారతీయుడైనను దేశీయమహాసభనుండి చీలిపోవునట్లు చేయగల యేఒక్కమాటయు నానోటినుండి జారగూడదని నేను నిశ్చయము చేసికొంటిని వేయేల కీర్తిశేషులగు మార్లేగారు చెప్పినమాటలనే నేనిప్పుడు చెప్పుచున్నాను:—"మితవాదులను దరికి చేరదీయుడు." భారతీయులకు తానుచేయగల న్యాయమునే తన దేశీయులుకూడ చేయవలసినదని హెచ్చరించుటలో ధైర్యమును చాకచక్యమును చూపినవాడు మార్లేప్రభువు. మొన్న తటస్థించిన వీరిమరణముచే ప్రపంచ మిట్టివానినొకని గోల్పోయెను.



—♦ మితవాదులు; సామ్రాజ్యసభ. ♦—

క్రిందటి ఎన్నికలవిషయమై నేను పాక్షికదృష్టి వహింపను. వోటు అధికారము బహుసంకుచితముగనుండుటచే, జాతియొక్క నిర్ణయమీ యెన్నికలవలన సిద్ధింపజాలదు. కాని అన్నిటికంటె యెక్కువ నిశ్చయముగ తేలినవిషయమేదైన నున్నచో అది ఒక్కటేగలదు; ఏమనగ:—భారతవర్షమిక యెన్నటికి తన పరపాలకులతో సహకారమొనర్పదు. సహకారమొనర్చుటను తిరస్కరించుచున్నది. మనము మొన్న నాలుగు సంవత్సరములక్రింద యేయభిప్రాయములలో నుంటిమో, యిప్పుడట్టి యభిప్రాయములలో నున్న కొందరు దేశీయులకు గల భ్రమహీనులకై యీమధ్య ననేకసందర్భములు తోడ్పడెను. ఖండాంతరములందలి భారతీయుల స్థితినిగూర్చి సామ్రాజ్యసభలో జరిగిన చర్చలు లోకమందంతటను బాహాటముగ ప్రచురింపబడినవి. ఇవన్నియు విన్నతరువాతకూడ, యీ స్వల్పమైన యొకకై యూహించుచేపబుద్ధిహీనమైన చేష్టయైయుండవలెను. లక్షో అర్వైవేలమంది భారతీయులున్న దక్షిణాఫ్రికా బిర్రబిగిసియున్నది. కెన్యా మొదలగు "క్రౌను" కాలనీల విషయములోనే యేమిచేయుటకు తోచక, "స్వతంత్రరాజ్యముల అంతరంగిక విషయములలో మేమేమిచేయుటకు మాకు మొగతనములేద"ని స్పష్టముగ ఒప్పుకొనక యేదోతుచ్ఛమగు తీర్మానమునొక దానినిచేసికొన్న సామ్రాజ్యప్రభుత్వమువారు తమతీర్మానము నిప్పుడు రద్దుచేసికొందురను ఆశలేదు. తన తుచ్ఛతీర్మానమును రద్దుచేసికొనుటకు చేతగాక "మరల మీసంగతి యింకొకసారి వినెదమని" చెప్పినది. ఇక తక్కిన వలసరాజ్యములు "సానుభూతిని" చూపుచున్నవట! "సానుభూతి"కేమి తక్కువ! దానికి దమ్మిడీయైనను ఖర్చులేదు. అయినను అదిమూడబోయినను "కొమగటామారు" ఓడను సంబంధించిన 1100 భారతీయుల విషయములో ఆ "సానుభూతి" కూడ సున్నయై—

నది. నూరుమందిమాత్రముకూడ లేని కెనడాలో కొంచము బాగుగ నున్నది. డాక్టరుసప్రూగారు మన భారతీయులవిషయమై సామ్రాజ్య సభలో చేసిన ఉద్రేకపూరితమగు సేవను నేను సంపూర్ణమైన విలువ నిచ్చుచున్నాను. వారు పొందినజయము సంపూర్ణమైనదే. కాని మొదటినుండియు వారిగమ్యస్థానము బహు తక్కువగనుండెను. కావున వారు పొందినజయము మాకు—వారికివలె ఆతానుమతగలవిమాకు—వేడి పుట్టింపలేదు. మాకది చల్లగనే—చప్పగనే—గన్పట్టెను.

ఈసందర్భమున నాకొకకథ జ్ఞాపకము వచ్చుచున్నది. నాస్నేహితుడొకడు చాలధనమువచ్చు ఉద్యోగమును వదలివేసెను. ఏప్యాసైన మహాత్మునీయు డెవడును యిదివరకు చేయని విధముగ క్రొత్తత్రోవ ద్రొక్కి బొంబాయిలో కమిషను యేజెంటు పనిపెట్టుకొనెను. అతడు నాకొకరోజున కనిపించి బహుఉల్లాసముతో నావద్దకువచ్చి తనకాదినమున నూటికి నూరురూపాయలు లాభమువచ్చినదని చెప్పెను. కాని కొంచెము నేను వివరముల నడిగితిని. ఆనాడాదినమున డజను జపాను పేపరు కట్టలు నమ్మెనట. తనకువచ్చిన నూటికి నూరులాభము తనఆఫీసు అద్దెకు సరిపోదట! అనేక సంవత్సరములు కొట్టుకొనగ కొట్టుకొనగ తుదకు 1921 లో ఖండాంతరముల భారతీయులకు సమానస్థానము నొసగుట వాంఛనీయమను భావము నంగీకరించుచు సామ్రాజ్యసభ యొకతీర్మానము జేసెను. కాని యీసామ్రాజ్య నాటక ప్రదర్శనములనన్నిటిని నడపించు అధికారియైన స్మట్సు సేనాని అసలు ప్రధానపాత్ర లేకుండ యీనాటకమును ఆడించెను. అట్లయ్యును తనకువచ్చిన నూటికి నూరు లాభమును చూచుకొని మురియవలసినదని మన భారతదేశము నడుగుచున్నారు. పోని అదికూడపోయినను ఆలాభము మనకింకను చేతికిరాలేదు. రెండుసంవత్సరములైన తరువాత మరలదానికొరకై సామ్రాజ్యసభలో పోరాడవలసి వచ్చెను. ఈ బేరముయొక్క స్వభావమును



గూర్చి అనుమానములు పుట్టెను. సొమ్ముయిచ్చివేయుట అవుసరమా లేక వాంఛనీయమాయను అనుమానము పుట్టెను. ఈసందర్భమందు అసలు బేరమునే రద్దుచేయవలసినదనిస్మట్సుసేనానికోరెను. ఈయేజెంట్లిద్దరిలో సమాధానముకుదురలేదు. స్మట్సుసేనాని భారతదేశమునకు అంతరంగికస్నేహితుడను క్రొత్తవిశేషము నొకదానిని యీయిద్దరి యేజెంట్లలో నొకఆయన కనిపెట్టెను. ఈయన కనుగొన్న క్రొత్త విషయము కొలంబసు కనుగొన్న క్రొత్తవింతకంటె యెక్కువగనున్నది. ఈయేజంట్లకు యిట్లు సమాధానము కుదురకపోయినను, భారతవర్షమునకు మరల అదృష్టము తోడయ్యెను. మనకు మరలనూటికి నూరు లాభములు వచ్చెను. ఈలాభము మనచేతికి యిప్పటిలో వచ్చు ఆశ యేమైన నున్నదేమో స్వయముగ కనుగొని వచ్చుటకై ప్రతిభాగ స్వామివద్దకు వెళ్ళుటకొక "ఓడసంఘము" బయలుదేరును. ఇది మన కిప్పుడు వచ్చినలాభము. డాక్టరు సప్రూగారి ట్రావెలింగు యేజెంట్లలో కొందరు సివిలుద్యోగపు పెద్దలు వున్నారు. వారికి "జాన్ బుల్, నన్ను అందుకో" వారి భాగస్వాములతో ప్రత్యేకముగ వ్యవహారము జరుపుకొను గొప్ప గౌరవము లభింపగలదు.

వచ్చినలాభము నేనేమో తగ్గించి చెప్పుచున్నాననే అనుమానము లేకుండ, "ఇండియా, అండ్ కామన్ వెల్తు" అను సంపాదకీయ వ్యాసముయొక్క తుదిభాగమందు టైమ్సుపత్రిక బహుశ్రమపడి తేల్చిన సారాంశము నిట వివరించుచున్నాను. "బ్రిటిషుగవర్నమెంటు యొక్కయు, ఖండాంతరములందలి అధినివేశరాజ్యములయొక్కయు, ప్రతినిధులు చూపిన సానుభూతియు, సుహృద్భావమును, సమిష్టిసామ్రాజ్యమందు భారతదేశమునకుగల భాగమునుగూర్చి వారుత్రికరణశుద్ధిగజూపినమెప్పును—యివన్నియు ఒక యెత్తు. తదితరభాగస్వాములతో భారతదేశము స్వయముగ రాయబారములు నడుపుకొను హక్కు ప్రత్యేకముగ నంగీకారమగుట యింకొక యెత్తు. రెండవదానికంటె మొదటిది తీసిపోదు. నిజమే, డాక్టరుసప్రూగారును, వారిరాచతోడును

కలిసి భారతవర్షమునకు "తదితర భాగస్వాములతో స్వాయముగరాయ భారము వహుపుకొనుహక్కుయొక్క ప్రత్యక్షాంగీకారమును" సంపాదించుకొని వచ్చినమాట వాస్తవమే. కాని యీ భోగము యెప్పుడు ముగియును? సొమ్ము మనచేతిలోనికి యెప్పుడువచ్చును? అదియెంత మొత్తముండును?

ఇక్కడ సకాలములందు సామ్రాజ్యసభలు ఒకదానివెంట మరియొకటి తప్పక జరుగుచునేయుండును; సందేహములేదు. ఒక్కొక్కసభయందును భారతదేశపు పరాధీనదశ అంతకంత కెక్కువగ లోకమునకు ప్రకటితమగుచునే యుండును. కాని సామ్రాజ్యాధికారపు పొరలు భూగర్భమందలి మట్టిపొరలవలె పట్టముగ మననెత్తిమీద అంతులేకుండ నానాటికి పెరిగిపోవుచున్నప్పుడు మానవస్వభావము యెంతకాలము ఓరిమితో ఆశపెట్టుకొనియుండగలదు? సామ్రాజ్యమందు మనము పొందుచున్న చీమనడక యభివృద్ధిచూచి యెంతమితవాదియైనను సంతృప్తిజెందజాలడు. మనకు కనిసపున్యాయమును గలుగచేయుటకై యిగ్లండునకు అంతులేని గడువునివ్వగల ఉదారుడు "లిబరల్సు" (ఉదారులము) అనిచెప్పుకొనువారిలో కూడ లేరు. అందులో ముఖ్యముగ తప్పుడువిద్యాపద్ధతివల్ల మనదేశములోని పుంస్త్వము, పౌరుషము నానాటికి క్షీణించిపోవుచున్నదను సంగతి వారికిప్రతిదినము ప్రత్యక్షముగ గోచరించుచున్నప్పుడు—గోచరించి తీరవలసియున్నప్పుడు—ఎవరింక ఓపికపట్టగలరు?

మనకు పిడినంత సంపూర్తిగ మనమితవాదులకు కూడ భ్రమ పిడినప్పుడుకూడ మనము పరిష్కరింపవలసిన విషయమింకొకటి యుండియేయున్నది. అప్పుడు "మీరెంతవరకుపోవుటకు సిద్ధముగనున్నారు?" సహాయనిరాకరణతత్వము మొదటినుండియు "అత్యధిక సంఖ్యాకుల అత్యల్పత్యాగము"నే కోరెను. గాంధియుగానంతరము "అత్యల్పత్యాగ" మనబడినది. తత్పూర్వయుగమందు సాధారణముగ "అత్యధిక త్యాగ" మనబడినదానికంటె చాలయెక్కువదై యుండవచ్చును. కాని పరిమితత్యాగ తత్వమువల్ల స్వరాజ్యము రానూరాదు; వచ్చినను నిలవనూ నిలువదు. డాక్టరు సప్రూగారి పద్ధతి బాగున్నదనేయును



కొందము; కాని దాని ననుష్ఠించుటకు దానిలో యేమున్నది? కేవలము తీర్మానములు, పిటీషనులు, ఖండనలు మహాయెక్కువగ చేసినచో అప్పుడు ఒకచిలిపి హారతాము! ఇంతేనా! అంతాయింతేయైనచో యీనిర్జీవ రాజకీయము నికట్టిపెట్టిపోదము. ఎవరిపూర్వజులు "రన్నిమీడ్" యందుగదా స్వాతంత్ర్యమును సంపాదించిరో, యెవరిపూర్వజులు "బాస్టిలీ" కోటను నేలమట్టముచేసి స్వాతంత్ర్యమును సంపాదించిరో అట్టివారికి రాచకీయములో చెల్లాటలాడుటకు చెల్లినచెల్లుగాక! కాని మనమున్ననో యింకనుస్వాతంత్ర్యపట్టాను (మ్యాగ్నకార్టాను) సంపాదించుకొనలేదు; "హక్కులబిల్లు"ను సంపాదించుకొనలేదు; కావున రాచకీయములో—పాశ్చాత్యదేశస్థులవలె—మన మిప్పుడు చెలాటములాడుటకు యింకనువీలులేదు. మనముచాలకాలము "పీనల్ కోడు"ను మించిపోకుండ యోచించెడివారము; "డైసీ" మొదలగు రాజ్యాంగ వేత్తల గ్రంథములందలి విషయములను గూర్చి మాట్లాడినచో మనము చాలపైకి వచ్చితిమని మనమిప్పుడు తలంచుచున్నాము. కాని మనభావములు యీహద్దులన్నిటిని దాటిపోయి వీనికతీతముగు చారిత్రకములను గమనించవలసి యున్నదను సంగతిని మరచితిమి. మితవాదులు చాలతెలివిగలవారని నేను ఒప్పుకొందును; కాని తెలివిమాత్రము చాలదు; దానివెనుక శక్తియుండవలెను. ఇదే ప్రధానమైనది. పరప్రభుత్వమునుండి తనదేశమునకు స్వాతంత్ర్యమునుసంపాదించిన ప్రతిమానవుడును అపరిమితమగు బాధ్యతను వహించవలసియుండెనని ప్రపంచచరిత్ర చాటుచున్నది. అట్లే తానుకూడ స్వదేశవిముక్తికై అపరిమితమగు బాధ్యతను వహింపవలసి యుండునని ప్రతిమితవాదియు గట్టిగ గ్రహించినచో చాలును. అంతయు సరియగును. అతనికి కాంగ్రెసుమహాసభయే తగినస్థానమగును. వెనుకయులవాటువల్ల అతడు మొట్టమొదట నెమ్మదిగ నడచునుగాక. స్వరాజ్యపార్టీ నాయకులు తామెంతదూరమైనను పోవుటకు సిద్ధముగ నున్నామని చెప్పుటచేతనే నేనువారిని కాంగ్రెసులోనుంచి తరిమివేయుటకు ఇష్టపడలేదు.

## —: బార్డోలీ, స్వరాజ్యపార్టీ :—

స్వరాజ్యపార్టీలో చాలమంది యీరోజువరకు తామిదివరకు కష్టపడి సంపాదించుకొన్న పాశ్చాత్యమనస్తత్వమును వదలకుండ నిలుపుకొన్న మాటవాస్తవమే. అందుచేతవారు పార్లమెంటరీ చర్చలకును వాద ప్రతివాదములకును తరుచుగడంగుచుందురు. స్వసంరక్షణార్థమునైనను దౌర్జన్యమును ప్రయోగింపుదమను భావమునే మనఃపూర్తిగ వదలివేసిన వీరు తమనోటికి చప్పగనున్న బార్డోలీ విధానమును కొంచెము రుచికరముగ చేసికొనుటకై వాగ్యుద్ధమను మసాలా కావలెనని కోరుచున్నారు. మనభారతీయులయొక్క జీవిత విధానమందు సంపూర్ణమగు గొప్పమార్పును చేయుటయేగాక, ఆర్థిక దాస్యమునుండి మనలనుతప్పించి అసంఖ్యాకములగు మేలుల్ చేకూర్పసమర్థమైన రాట్నముయొక్క ప్రభావమును వారిలో చాలమంది పూర్తిగ గ్రహింపలేదు. గాంధిమహాత్ముడు దేశమును స్వరాజ్యద్వారమువద్దకు తీసికొనివచ్చి ఆకస్మికముగ నిలిపివేసినలోడనే దేశమందు జనించిన నిరుత్సాహముయొక్క మూర్తీభావమే యీస్వరాజ్య పార్టీయైయున్నది. స్వరాజ్యద్వారము చెంతకుచేరిన తరువాత, సమష్టి శాసనోల్లంఘనముద్వారా ఆతలుపును పగులగొట్టి లోనికిపోవుట వివేకము గాదని మహాత్ముడు ప్రకటించెను. మరియు శత్రువుమీదికి కవ్వించుచుపోవు పద్ధతిని ఇకమానివేసి మనకాపుదలమీద మనముండవలెననియు మహాత్ముడప్పుడు ప్రకటించెను. ఇదంతయు ప్రజాసమూహముల నిజతత్వమెరుంగని వారికి ఓటమిగదోచెను. అందుచే నిరుత్సాహముగలిగెను. ఆనిరుత్సాహముయొక్క స్వరూపమే యీస్వరాజ్య పార్టీ. కరాచీజైలునుండి బీజపూరుజైలునకుపోవుచు మధ్యత్రోవలో బార్డోలీలో నేను మహాత్మునితో చెప్పినట్లు అతడొనర్చిన మార్పు తనబలమునే సూచించునుగాని, బలహీనతను సూచింపదు. ఆయన యింకొక కొద్దిరోజులు బయటనుండియున్నచో, యీయుద్యమస్వరూపమునంతను పూర్తిగ మార్చివేసెడివాడు బార్డోలీయొక్క మొదటి నిరుత్సాహపు దెబ్బనుండి ప్రజలు తెప్పిరిల్లకపూర్వమే ఆయన జైలునకు పంపబడెను.



ఆయనను ప్రేమించువారు కోట్లకొలది ప్రజలున్నను ఆయనయెడబాటు వల్లకలిగిన బాధ ప్రతివారికినున్నను, బార్డోలీ కార్యక్రమమునకు ప్రాణముపోయగలవారెవరును లేకపోయిరి. మరియు మహాత్ముని దుష్టునిగ భావించి చెరసాలలో నుంచుటవల్ల ప్రభుత్వమువారు ప్రజలచేతులలో పెట్టిన ఆయుధమును పూర్తిగ వినియోగింపగల వారును దొరకలేదు చౌరాచౌరీ యుదంతమైనపిమ్మట దౌర్జన్యరహితమైన సమిష్టి శాసనోల్లంఘనము సాధ్యముకాదని నిరుత్సాహవాక్యముల చెప్పినవారిమాటలను వినుటలో మహాత్ముడు సరియైనపనిజేసెనో లేదో నేనిప్పుడు చెప్పజాలను. కాని గాంధిమహాత్ముని చెరసాలలో వేసిన తక్షణమే దౌర్జన్యరహితమైన శాసనోల్లంఘనము సాధ్యమయ్యెడిదని నాదృఢ విశ్వాసము (నేనేయున్నట్లయిన) నేనప్పుడు నానాయకుని మాటనైన తిరస్కరించి గవర్నమెంటు నాచేతికందిచ్చిన యవకాశము (ఆయుధము) నాధారముచేసికొని గవర్నమెంటుతో పోరాడియుందును వైద్యునకు జబ్బుగనున్నప్పుడు మాఅన్నగారు చెప్పినట్లు—ఆవైద్యునే మందువేసికొననివ్వరు మహాత్మాగాంధిని చెరసాలలో బడవేసినప్పుడు (బొంబాయిగవర్నరు చెప్పినట్లు బ్రతికియుండగనే పూడ్చినప్పుడు) మనమాతని దౌర్జన్యరహిత తత్వమును మన్నించిన చాలియుండెడిది. శాసనోల్లంఘనమునుకూడ నిలిపివేయవలసినదని ఆయన చెప్పినమాటను పాటింపనవుసరముండదు. మనమిట్లుచేసియున్నచో అసలుస్వరాజ్య పార్టీ పుట్టియుండక పోయెడిదేమో!

## —: కాంగ్రెసునకును, స్వరాజ్యపార్టీకిని యికముందుండ బోవు సంబంధము:—

స్వరాజ్యపార్టీయొక్క యుత్పత్తినిగూర్చి మనకెట్టి యభిప్రాయములున్నను అట్టి పార్టీయొకటి యున్నదను సంగతిని మరచిపోవుటకు వీలులేదు. ప్రారంభదశలో అది కొద్దిగనే యుండెను. కాని, "శాసనోల్లంఘనకమిటీ"వారి సంచారమువల్ల ప్రజలయొక్క దృష్టి నిర్మాణ విధానమునుండి మరలి, మనయువకులలో యుత్సాహవంతులగు వారిని చాలమందిని శాసనసభాప్రవేశవాదులలోనికి దింపెను.

కమిటీ పర్యటనమువల్ల మనలో అత్యుత్తములగువారియొక్క కాలమును, దృష్టియు, శక్తియు, దానిక్రింద ఖర్చుపడెను. నిర్మాణకార్యక్రమము చక్కగ కొనసాగుచు, యువకులందరును తమకాలమునంతను దానిక్రిందనే వినియోగించి యున్నయెడల యీ శాసనసభా ప్రవేశవాదస్థితి యెట్లుండెడిదో మనమిప్పు డూహించుట నిష్ప్రయోజనము; ఊహించుట భావికర్తవ్య నిర్ణయమునకేమైన తోడ్పడవచ్చును. అదిగాక, శాసనసభా బహిష్కార ప్రచారమును నిలిపివేయుచు ఢిల్లీలో చేసిన తీర్మానమే గయలో చేసియున్నట్లైన, మాస్వరాజ్య పార్టీ వారింక యెంత యెక్కువగ ఎన్నికలలో జయమొందెడివారో యూహించి చూడుడని యిటు నాస్వరాజ్యపార్టీ స్నేహితులు నన్ను హెచ్చరించుచున్నారు. దానికి నేను చెప్పు సమాధానమొకటి యున్నది. అది నాయొక్క అహంభావముమీద నాధారపడియున్నది. నేనేగనుక గయలోనుండి అంత వివేకమని చెప్పుటకు వీలులేని పద్ధతిని తమను అనుసరింపవద్దని వారిని బ్రతిమాలుకొని యుండకున్నచో, అసలు స్వరాజ్య పార్టీయనునది పుట్టియుండెడిదేమో యూహింపుడని నేను వారినడుగుచున్నాను. కాని, యివన్నియు యిప్పుడు వట్టిగాలిలోని యూహలు. స్వరాజ్యపార్టీయనునది యీరోజున నున్నది. ఆపార్టీయందు నానారకములగు తత్వములున్నను, అది యీరోజున సంఖ్యయందు బలముగనే యున్నది; అది తన నాయకాగ్రణియొక్క సుగుణ సంపత్తియందుకూడ మొదటినుండియు బలముగనే యున్నది. అదిగాక, అన్నిటికంటె యింకొక్క విశేషమేమనగా:—అది తన స్వీయమైన మత నైతిక బాధ్యతమీద శాసనసభలకు పోవచ్చునని ఢిల్లీతీర్మానము అనుజ్ఞనిచ్చెను. అది ఎన్నికలకు నెగ్గినది. తనకు ప్రతిపక్షముగనున్న యితర శక్తులనుబట్టియు, తనశక్తులను కూడదీసికొనుటకు తనకున్న బహుకొద్దికాలమునుబట్టియు, తనపార్టీలోనున్న యత్యుత్తములగువారు యెక్కువకాలము శిక్ష ననుభవించుటచే ఎన్నికలకు నిలుచుటకు వీలుకలుగకపోయినందున గలిగినయిబ్బందినిబట్టియు—చూచినచో స్వరాజ్య పార్టీ యెన్నికలలో చాల జయముపొందెననియే చెప్పవచ్చును.



అదిగాక, వోటర్ల జాబితాలు బహులోపభూయిష్టముగ నుండెను; ఏలననగ, మూడు సంవత్సరములక్రింద మితవాదులుతప్ప తక్కినవారెవరును వానిమొగమే చూడలేదు. మొన్న స్వరాజ్యపార్టీలో చేరినవారుకూడ ఆఖరువరకు స్వరాజ్యపార్టీలో చేరుదమా వద్దాయనియు, ఎన్నికలకు నిలుతమా వద్దాయనియు డోలాయమాన మానసులైయుండిరి. వోటర్లలో చాలమంది తమకు వోట్లిమ్మని యడిగిన వ్యక్తులకు వోట్లనివ్వక కాంగ్రెసునకేయిచ్చిరి. అదిగాక యింకొక హాస్యము, యెవరితోను చెప్పవద్దు సుమండీ—గాంధిమహాత్మునకే వోట్లనిచ్చిరి! ఈసంగతి విన్నప్పుడు మనస్నేహితులలో చాలమందికి గాఢమైన విచారము కలుగవచ్చును. గాంధిమహాత్ముని నామము నట్లుదుర్వినియోగము చేయుట పాపమని తలంచువారును గలరు.

అట్టివారియందు నాకుచాల సానుభూతి గలదు. అట్టి రాజకీయ పద్ధతులకు నేను సమ్మతింపను. కాని ఆప్రకారముగ ప్రజలు వోట్లిచ్చి పంపిన అభ్యర్థులు తత్ప్రతిపక్షులకంటె మహాత్మునకు బహుదగ్గరలో నున్నారను సంగతినిమాత్రము మనము జ్ఞాపకముంచుకొనవలెను. అదిగాక యీఅభ్యర్థులలోనే మహాత్ముని వెక్కిరించువారుకూడ గలరు. నవనాగరికతాభివృద్ధి నొందుచున్న యీరోజులలో స్త్రీలుకూడ దూరముగ పారవేసిన పనికిమాలిన రాటమును తీసికొనివచ్చి అదే మోక్షమిచ్చునని నమ్ముకొను యీవెర్రి యలౌకిక మహాత్మునిచూచి పరిహసించువారుకూడ గలరు. అధికార పూర్వపాలకులతోడను యుద్ధకాలమందు అమెరికనులంతవారికే పంగనామములు పెట్టిన [illegible] గారి యిత్రోడను వ్యవహరించవలసియుండగ యిట్టితప్పులను అనేకతీవలను చేయు యీఛాందసుడు తమకెక్కడ దారికి రాయనుకొనువారుకూడ గలరు. తమ ఎన్నికలలో మహాత్మునియొక్క నామమాహాత్మ్యము వీరికి స్వానుభవ గోచరమై యుండును. తమకెంతటి తెలివితేటలున్నను మహాత్ముని యనుచరులగు ప్రజాసామాన్యమిచ్చు సాహాయ్యముమీదనే శాసనసభయందు తనయొక్క బలాబలములు నిలచియున్నవని వారికి గోచరించియుండును. ఎన్నికలలో వీరికి గలిగిన యీస్వానుభవము

చాల విలువవైనది. స్వరాజ్యపార్టీనాయకులు తాము జయమొందిన సందర్భమందు మేమనుకొన్న రీతిగనే వారుచూపిన సుహృద్భావము, నిగ్రహము, ఔదార్యము నిజముగ ప్రశంసా పాత్రములు. ఇవి కాంగ్రెసున కెంతయు నమూల్యములగు ధనములు. వారిస్కీమునందు వారికున్నంత నమ్మకము మనకులేనిమాటవాస్తవమే. నిర్మాణకార్యక్రమముగాక శాసనసభలే స్వరాజ్యమును తెచ్చిపెట్టునను భావము ప్రజల మనస్సులలో నెచ్చటనైన దాగియున్నచో యొకమూల దానిని తీసి పారవైచుచు ఇంకొకమూల తమఇష్టమువచ్చినట్లు చేసికొనుటకు స్వరాజ్యపార్టీవారికి సంపూర్ణ స్వాతంత్ర్యమిచ్చుచు, వారికి జయమగుగాక యనికూడ మనము కోరుచుండవలెను. మనము ఢిల్లీలో శాసనసభా బహిష్కార ప్రచారపు హక్కును అమలుజరుపుకొనకుండ ఊరకుంటిమి. అంతమాత్రముచే మన తత్వమును వదలుకొనలేదు. ఈరోజునకూడ వదలుకొనము. స్వరాజ్యపార్టీవారు కౌన్సిలులో చేయవలసినపనిని నడపించు బాధ్యతను మనము వహించుట కంగీకరించినచో అప్పుడు మనతత్వమును వదలుకొన్నట్లగునుగాని అంతవరకుకాదు. ఈ బాధ్యతను మనమంగీకరింపజాలము. నిర్మాణకార్యక్రమమునకు స్వరాజ్యపార్టీవారు మనవలె తగినంతకాలమును వినియోగపరుపజాలరు.

అయినను, బాధ్యతగల స్వరాజ్య పార్టీనాయకులు తమశక్తివంచనలేక మనకు సహాయముచేయుటకు ఉద్దేశించియున్నారని నాకుపూర్తిగ నమ్మకముకలదు. యీరీతిగ వారు కౌన్సిలులో తమయొక్కబలమును కూడ పెంపొందించుకొన నుద్దేశించియున్నారు. వారెప్పుడైన నికముందు శాసనసభలనువిడిచి రావలసివచ్చినచో మన సంయుక్తప్రయత్నములవల్ల నాయానియోజక వర్గములలో నప్పటికి గావింపబడియుండుపని యెట్లుండును? "వారు వెళ్ళిపోయినప్పుడు ఒకకుక్కకూడా మొరగలేద"ని అధికారవర్గమువారనకుండ నుండుటకు వీలేర్పడును. వారు కౌన్సిళ్ళలో పడినశ్రమవల్ల స్వరాజ్యము లభించినచో, దానిని నేను మాత్రము వద్దనను. కాంగ్రెసుప్రతిష్ఠను నిల్పుటకై శాంతియు, సుహృద్భావమును, ఐకమత్యమును ఢిల్లీలో అవసరమైనచో, ఆప్రతిష్ఠను మ



రింత హెచ్చుచేసే నిర్మాణ కార్యక్రమమును కొనసాగించుటకు మనకీరోజున అవి మరింత యెక్కువగ కావలసియున్నవి.

—:నిర్మాణ కార్యక్రమము;—

ఈకార్య క్రమమందలి యభిమానముచేతనే, నేనప్పుడు ఢిల్లీలో మన తగాదాల నేదోవిధముగ పరిష్కరించుకొనితీరవలెనని అంతపట్టు బట్టితిని. చాలారాష్ట్రములలో ఒక సంవత్సరమంతయు వృధాగా పరస్పరము నిందించుకొనుటలతో పాడయిపోయెను; మహాత్ముని విడుదల కేవలము పిటీషనులవల్లగాక మనస్వకృషివల్ల గావలసియున్నది. అట్లయినచో ఆయన హృదయపూర్వకముగ నమ్మిన నిర్మాణవిధానమును మరల కొనసాగించుట అత్యవసరము. మహాత్ముడు చెరసాలకు వెళ్ళిన తరువాత దేశమెంత భ్రష్టమయ్యెనో నేనప్పుడు పూర్తిగ తెలిసికొనలేదు. "మీరేమిపనులు చేసినార"ని నేనడిగిన ప్రశ్నలకు నాకువచ్చిన కొద్దిజవాబులవల్లనే యేకారణముచేనైతేనేమి దేశములో యెంతమాత్రమును పనిజరుగలేదని నాకుతెలిసెను. పనిచేసిన గుజరాతువంటి రాష్ట్రములు లేకపోలేదు. యీపనియొక్క గౌరవము నామిత్రులు శ్రీయుత వల్లభాయి పటేలు గారికిని మహాత్ముడు వెనుకనుంచి పోయిన యనుచరులకును చెందుచున్నది. విద్యావిషయమై వారుచేసినంత పనిని యేయితర రాష్ట్రములు చూపజాలవు. గుజరాతురాష్ట్రమే లేకపోయినచో, తక్కిన రాష్ట్రములలో తయారైన ఖద్దరు అమ్మకముగాక చాలకాలము నిలిచిపోయెడిదే. మహాత్ముని గొప్పతనమేమనగ, ఆయన గుజరాతుదేశముయొక్క స్వరూపమునంతను మార్చివేసెను; అంతియేగాక, భారతదేశముయొక్క స్వరూపమును కూడ ఆయన మార్చివేసెను. ఆయనయేరాష్ట్రమునుకూడ అదివరకున్నట్లుగ ఉంచకుండమార్చివేసెను. గుజరాతులో యింకొక విచిత్రమైన సంగతి జరుగబోవుచున్నది.

మహాత్ముడు చెప్పిన అత్యున్నత పదవియే గావలెనన్నచో యే ప్రాంతము శాసనోల్లంఘనమునకు సిద్ధముకానే గాదనుకొనువారికి ఆశ్చర్యము గలిగించు పనిని గుజరాతుదేశమిప్పుడు చేయబోవుచున్నది

కాని, గుజరాతు చూపిన నిదర్శనము ప్రజలనంతగ నాకర్షింపలేదు. కాని, మనము స్వాతిశయమునందు కన్నులు మూసికొని యుండజాలము.

ఒక నౌకాదళములో ఆఖరుపడవ యెంతనెమ్మదిగా నడచునో నౌకాదళమున కంతటికికూడ అంతవడియేయుండును. మన నౌకాదళములో నెమ్మదిగనడచు పడవలు అయ్యో!—చాలవున్నవి. కాని, భగవదనుగ్రహమువల్ల అవియన్నియు సముద్రయానమునకు పనికివచ్చునవిగనే యున్నవి. ఢిల్లీ కాంగ్రెసు అయినతరువాత "మార్పువద్దు"ని చెప్పు పార్టీలోవారొకరు "యంగు—యిండియా" పత్రికలో వ్రాసిన వానికంటె నేనిప్పుడు "మార్పువలద" ను నాస్నేహితులయొకట యెక్కువ గట్టివిమర్శనా సిద్ధాంతములను ప్రసాదింపజాలను.

"కేవల తర్క—హేతువాదములకు పరిమితిగలదు. అపిదాటజాలని మెట్టు ఎచ్చటనో యొకచోట తాకుచున్నది. కొన్నితీర్మానములు కార్యాచరణవంటివి. అవి హేతువాదమునకతీతములైనవి. హేతువాదమువలన నమ్మకము పుట్టి చజాలసపుడు ప్రత్యక్షానుభవమే మనకు గణపాఠముల నేర్పగలదు. మనమట్టిసంధిగావస్థలో పడితిమని గుర్తింపగలిగితిమి. ఒకసంవత్సరపర్యంతమును హృదయమలగాలించి గావించి తర్కాన పనులన్నియు కట్టిపెట్టుటచే మనకు సోత్కర్షయు ఎందును పనికిమాలిన సంతృప్తియు నధికమయ్యెను. స్వరాజ్యపక్షమువారికి మాధ్యస్థులకు మహమ్మదాలీగారికి మాత్రమేగాక మనవంటిమార్పు నెల్లని శ్రద్ధ అసహాయవాదులకు సయితము పరీక్షాసమయమే తెంచెను. నిజపరిస్థితులెంత విషమించినను వానిని గమనింపకుంట మనవిధి. కలకత్తా ప్రత్యేకకాంగ్రెసు నాలనుండియు గాంధీసిద్ధాంతము సర్వత్ర అజేయమైయుండెను. అందువలన గాంధశిష్యులకు మనము ఎప్పటికప్పుడు యోచనాశూన్యత కార్యదీక్షారాహిత్యమునను లోపములకు లోనగుదుమను భీతియే కలుగుచుండెను. అపజయమందరికిని యొకవిధముగ శుభావహం. మనలో సత్యమే యున్నయెడల అపజయు ఫలితముగ నాత్మపరీక్ష కావించుకొని మరల ధైర్యమవలంబింపగలుగుదుము. అట్లుగాక కేవలము స్తబ్ధులుగ నుండుటకును ప్రత్యక్ష నిదర్శనముల జూచి



నపిహ్మాట నైనను మనయభిప్రాయముల పూర్వ నిర్ణయింపకుండుటకును మాత్రమే గాంధీసిద్ధాంతముల నుపయోగింపదలచితిమేని మనము నిజగురుత్త్వముని నిజశిష్యులము కానేరము. ఆయన ప్రపంచమునకు చాటిన దివ్యసందేశమును కాపాడ సమర్థులము. ప్రత్యక్ష నిదర్శనమే పరమ ప్రమాణము"

నిజమే ప్రత్యక్షానుభవమే. తప్పక పరమప్రమాణము. సత్యమైనట్టియు నిశ్చితమైనట్టియు ప్రమాణము. మిత్రులారా మీరును నేనును స్వరాజ్య వాదులును మార్పునంగీకరింపజాలనివారును ఎల్లరును ప్రత్యక్ష నిదర్శనములచే పరీక్షింపబడుదుము. మనయోగ్యతలందువలన తేలగలదు. కావున నే కార్యాచరణకు గడంగుడని సందేశము నొసంగుచున్నాను. ఇదిచెప్పుట సులభమేగాని చేయుటమాత్రము కష్టమైనసందేశము. అందువలన పనిచేయువారికన్న వంకలపెట్టువారధికముగనున్నారు. సక్రమముగ కార్యనిర్వహణ మొనర్చుటచే గలిగిన మహదానందము పనిలేని విమర్శనములవలన సిద్ధింపజాలదు. కవిత్వమునందలి సృజనశక్తిగూర్చి యొక సంస్కృత కవీశ్వరుడు చెప్పినట్లు "గొడ్డురాలికి ప్రసవవేదనానుభవమెట్లులేదో అటులనే నూతన శిశుసందర్శనానందమును స్పర్శసౌఖ్యమునుకూడ అనుభవైకవేద్యములుకావు." వేదనాఫలితముగనే భారతవర్షము స్వాతంత్ర్యపునర్జీవితము నొందగలదు.

—: బర్డోలీ కార్యవిధానము నెరవేర్చి తీరవలెను, :—

మనమింక దేనిచేయవలెనని మీరునన్నడుగవచ్చును. పలువురచే నపహాసింపబడిన బర్డోలీ కార్యవిధానముకన్న నుత్తమమైనది వేరొకటిలేదని నేనుదీర్ఘాలోచనాఫలితముగ ప్రత్యుత్తరమిచ్చుచున్నాను. మనకార్యవిధానమునందు కష్టపరంపరలువచ్చుటచే నొకదానివెనుకనొకటిని విడనాడితిమో, మనమెప్పటికిని నేపనియు చేయజాలము. అసహాయోద్యమముకు విఫలమైనదని పలుకుదురు చెప్పుదురు. దీనిభావమేమి? వారో మనమో లేక ఉభయులమో సునలక్ష్యమునకు తగినత్యాగమును చేయజాలకపోతిమి.

మహాత్ముని కార్యవిధానము సులభసాధ్యమని ఇదివరకే చెప్పి యుంటిని. తమవృత్తిలో మరలప్రవేశింపవలసి వచ్చినదని న్యాయవాదులును వ్యాజ్యము వేయకతప్పినదికాదని కక్షివాదులును, పిల్లవానిని మంచిపాఠశాలకు పంపకుండుటెట్లని తలిదండ్రులును అనుచున్నారు గదా. సర్వసామాన్యుడైన నొక యుద్ధభటుడు ఎట్టి త్యాగమును కావింప సంసిద్ధుడై యున్నాడో మీరు జ్ఞప్తియుం దుంచుకొనరాదా?

—:కద్దరు పని: స్త్రీలు:—

కద్దరుగుడ్డనైనను కట్టజాలనివారిగూర్చి మన మేమనుకొనుట వలనను ప్రయోజనములేదు అట్టివారైనను, దేశభక్తి శూన్యులని గాని, స్వార్థపరులనిగాని చెప్పవలనుపడదు. మాంద్యము, అలసత్వము, వలన నట్లున్నారు. వారి మాంద్యమును పోగొట్టవలసియున్నది. అట్లు చేయగల సమర్థులు భారతనారీమణులకన్న నెవ్వరుగలరు? ఎవ్వరెట్లు మార్పుజెందినను, మన స్త్రీలుమాత్రము గాంధిమహాత్ముని యున్నతాదర్శములను విడనాడలేరు. మహాత్మునకును, భారతజాతికిని, తమకును, శ్రేయోదాయకమగు మార్గమునే వారనుసరించుచున్నారు. జమ్నాలాలు బజాజ్, మగనలాలు గాంధి, ఛగనలాలు గాంధీగార్ల వంటి అనుభవశాలుర సాయసంపత్తితోడను, గుమాస్తాలు, లెక్కదారులు మొదలగువారి తోడ్పాటుతోడను, ప్రతిరాష్ట్రమునందును, మండలమునందును స్త్రీలే కద్దరు నిర్మాణకార్యమును సంపూర్ణముగ తమస్వాధీనము చేసికొని నిర్వహింపగలరు. పురుషులు కారాగృహముల కేగుచుందురు. మరలి వచ్చుచుందురు. కాని, స్త్రీలుమాత్రము సర్వదా తమ కద్దరుపనిని జయప్రదముగ కొనసాగించు చుండవలెను.

తక్కిన శాఖలనుగూడ చక్కని స్థితియందుంచవలెను. కద్దరు తరువాత జాతీయవిద్యాశాఖ ప్రాముఖ్యమైనది. యావద్భారతజాతీయ విద్యాసంఘమును నిర్మింపుడని నేను బెజవాడలో తగినంతపట్టు పట్టకపోతినని చింతించుచున్నాను. ఇప్పుడైనను యావద్భారత దేశమునకును, ప్రతిరాష్ట్రమునకును, విద్యాసంఘము నేర్పరచి మన బాలబాలికల విద్యావిధానమును మనము నిర్వహింపవలెను. అన్ని శాఖలను



గూడ యు ప్రత్యేక ప్రత్యేకముగ చెప్పనవసరములేదు. బార్డోలీవిధానమునందలి ప్రతియంశమును అవశ్యాచరణీయమే. కాని మనము 1921 సంవత్సరములో నవలంబించిన పద్ధతినే తిరిగి యవలంభింపవలయును. అనగా సంవత్సరమునందలి వేర్వేరు సమయములలో, వేర్వేరు శాఖలయభివృద్ధికై ప్రత్యేక కృషిసలుపవలెను.

—: ధనము :—

ధనములేనిది వృథావాగ్వాదమంతయు వ్యర్థమగునుగాన, సంవత్సరమంత మనము శ్రద్ధవహించి ప్రయత్నములన్నియు కేంద్రీకరించి పనిచేయవలసినపని ధనసంచయము. మహాత్ముని కార్యక్రమమువలననే మనము యరవాడ చెరసాలయొక్క దాళపుచెవిని తయారుచేయగలమనియు, ఆపనియు ధనములేనిదే చేయజాలమనియు దేశము విశ్వసించినయెడల వలయుధనము నీయకమానదు. ఎప్పుడో నిర్ణీతకాలమున మనముకోరు పెద్దచందాలుగాక, అల్పమైనను బీదలకుకూడ తమ శక్తికొలదిని సహాయము చేయుట కనువగు ధనసేకరణోపాయములచే జాతీయకోశమును నింపవలయు అప్పుడప్పుడు బీదవాడు దానము చేయుటకు వీలగునట్లు తత్కాలము వసూలుచేయబడు చందారూపము మొదలగు ననేకవిధముల ధనమును సంపాదింపవలయును. ఇంతియెగాక వోటర్ల సంఖ్యకు సరిపోవు కాంగ్రెసు సభ్యులనొక్క విసరున చేర్చుటకు తగినయేర్పాట్లు చేయవలయును. మనము పట్టుదలతో పనిచేసినయెడల నొకకోటి రూప్యంబులు సేకరించుట యొకకష్టముకాదు.

—♦ కార్యదర్శులు, శాశ్వతోద్యోగులు. ♦—

ధనమెంతయవసరమో మహాత్ముని కార్యక్రమమును సాధించుటకు వీర్యవంతమైనయొక సంస్థయంత యవసరము, సంపూర్ణముగ వేతనములులేని జనసమూహము చేయబడిన ఫలపూర్తియగుట దుర్లభము. ఒకజిల్లాలోని యొకవిభాగమునకు చాలని సంఖ్యగల యుద్యోగియులతో నింతవిశాలదేశమున నింతకాలమింత పనియెట్లుజరిగెను. మిక్కిలియాశ్చర్యకరము. ఇప్పుడు క్షేమయలమైన పరిస్థితులు తటస్థించినవి. అర్హతగలిగి శ్రద్ధగలిగి నమ్మకముగల ప్రచారకులు జాతీయసే

మతమును ఎట్లుపెంపొందగల్గును? మన శిలుపవలన మనము సంపూర్ణమగు లాభమును బడయలేము. కారాగృహమున బంధింపబడియున్న యీ మహానాయకునియందు వాత్సల్యమేమైన మీకు గలదేని, మిత్రులారా! యిప్పుడైనను కార్యాచరణకు గడంగుడు. ప్రజాసంతతుల మనకు తోడ్పాటొసంగుటకు హెచ్చరించి మహాత్ముని సహస్రసంఖ్యాకులగు నాతని యనుచరులను బంధించియుంచిన బాస్టీలు కారాగృహమును విధ్వంసమొనర్చి భారతవర్షమునకు దాస్యవిముక్తి గల్గింతము.

—సిక్కులును, నభారాజ్యాధీశ్వరుడును—

సిక్కుసోదరుల దృష్టాంతము మనకు గలదు. వారలధైర్యము మనస్థైర్యము అన్నిటికంటెను వారిల దౌర్జన్యరాహిత్యము, నాకసూయ బుట్టించుచున్నది. నభాసంస్థానాధీశ్వరుడు, పదభ్రష్టుడయ్యెను. నభామహారాజును రాజ్యములోనికి రానియకుండ జూచుటకు తాను దృఢసంకల్పము చేసికొంటిననివిదేశీయ ప్రభుత్వాధికారిచేసిన ప్రకటనయందలి మాటలు దైవదూషణగనున్నవి. మహారాజుగారి తరఫున నేను వాదించుటలేదు. కాని యిదిమాత్రము నిశ్చయము. వారిని నిందించువారందరు చెప్పుమాట నిజమయినను ఆయనయొక్క లోపములను గురించిఆయన పదభ్రష్టుడుకాలేదు. ఆయనయొక్క సుగుణములకు ఆయన పదభ్రష్టుడాయెను. నేనుకూడ ఒక హిందూదేశపు రాజుయొక్క పాలనలోని వాడను. ఇంకను అనేకమయిన హిందూదేశపు సంస్థానములయొక్క అనుభవమును నాకుకలదు. హిందూదేశపు సంస్థానములలో రాచకీయ సంస్కరణములు జరుగవలయునని కోరునట్టి అనేకమంది స్నేహితులు నన్ను సమీపించుచుండెడివారు. కాని, హిందూదేశపు రాజ్యములు ఇండియాయొక్క తక్కినభాగములకంటె దేశక్షేమాభిలాషులకు అది ప్రస్తుతము ప్రమాదభూయిష్టముగా కన్పట్టుచున్నను, అవిమనవియని వారితో చెప్పి అప్పటికప్పుడు వారిని ఆపుచుండెడివాడను.

ఒకసారి హిందూదేశమునకు స్వరాజ్యము వచ్చినయెడల ఆశ్చ



ర్యయుక్తమగు శీఘ్రకాలములో స్వదేశరాజ్యములన్నియు మారునని నేను చెప్పితిని. ఈస్వరాజ్యమువచ్చులోగా స్వదేశసంస్థానాధీశులయొక్క అనుమానములను రెచ్చగొట్టవలదు. వారియొక్క కష్టములను గ్రహించినట్టుగా తెలియజేయు ప్రతిఅవకాశమును మనము ఉపయోగించవలయును. ఈఅన్యదేశనిరంకుశత్వమునుంచి వారుగూడ బాధపడవలయునని మనము గ్రహించినారము. అనివారికి మనము తెలియజేయవలయును. ఇదియంతయు వస్తుదృష్టిగా ఉండవలయునని చెప్పుచుండెడివాడను. కాని ఆచె[illegible] సర్కారువారు మనకింతత్వరగా అవకాశమును కలుగజేసెదరని నేనెరుగను. కాబట్టి యిప్పుడు మనకట్టి అవకాశము వచ్చినది. గాన మనము దానిని ఉపయోగించుకొనవలయును. దానిని ఉపయోగించుకొనుటలో మనమతముయొక్క క్షేమమును మనము ఉపయోగించుకొనిన వారమగుదుము. విదేశనిరంకుశత్వపు బరువునుంచి స్వేచ్ఛను పొందుటకు స్వమతస్థులయెడ ఆయన సానుభూతిని ధైర్యమునుతో చూపి వారిపవిత్రమయిన గురుద్వారములను సంస్కరించుటకు చేసినప్రయత్నమునకయి నాభారాజుగారు కొంతవరకయినను బాధపడెను. సర్వకాలమును ఇండియాస్వదేశరాజులందరు తమకు లోబడియుండవలయునని కోరు నిరంకుశప్రభుత్వమునకు వ్యతిరేకముగా నిలువబడిన ఒక స్వదేశసంస్థానాధీశునికి సహాయము చేయుటకు ధైర్యమును కలిగినటువంటి సిక్కులు వారెంతయో బాధపడుచున్నారు. కాని, నేనుయిదివరకు చెప్పినట్టుగా గురుద్వారప్రబంధక కమిటీవారిని, అకాలీదళమును న్యాయవిరుద్ధములగు సభలుగా గవర్నమెంటువారు చెప్పుట అది ఆసంస్థలకుగాని సిక్కుసంఘమునకుగాని ప్రత్యేకముగా కలిగిన అపాయకరమగు దెబ్బకాదు. యావత్తుదేశమునకు వేసినసవాలు. ఈసవాలును మనము వప్పుకొనక పోయినట్టయితే జీవించదలచిన ప్రతిసంఘమును ఈప్రకారముగానే చూడబడును. అప్పుడు మనము ఆలోచించవలసినది యీకథ ఎవరికి కష్టములువచ్చునాయనియే.

## శాసనోల్లంఘనము.

పొల్లుమాటల సానుభూతియే కాకుండా మన సిక్కు సోదరులకు సహాయము చేయుటకు మనము యిదివరకే నిశ్చయించుకొంటిమి. కాని దానికంటె కొంచెమెక్కువ కావలయును. మహాత్మగాంధిగారి అరెస్టు దగ్గరనుంచి రాష్ట్రపు మొత్తమునిూద శాసనోల్లంఘనము చేయుటకు మనకు అవకాశము కలిగియుండలేదు. కాని శాసనోల్లంఘనము సులభమైన విషయముకాదనుసంగతి మనము దాచకూడదు.

అంతులేని బాధలను పొందుటకు మనముసిద్ధముగా నుండవలెను. 1921 సం॥లో జరిగినంతమాత్రమయినను నిర్మాణకార్యక్రమము యీసంవత్సరము జరుగలేదు. కాబట్టి దేశం యెంత బాధనుపొందుటకుసిద్ధముగానున్నదో తెలుసుకొనుటకు కష్టముగానున్నది. మనముతిరిగి నిర్మాణకార్యక్రమము ద్విగుణీకృతశక్తితో మొదలుపెట్టినయెడల శాసనోల్లంఘనము సాధ్యముమాత్రమేకాదు. ఢిల్లీలో యేర్పాటుచేయబడిన శాసనోల్లంఘన కమిటీవారు విశేషఫలచరితమగు పనిచేయుటకు శక్తిగలిగియుందురు. యెందుకనగా స్వరాజ్యము మనము సంపాదించుటకు పూర్వము శాసనోల్లంఘనము చేయవలయుననిమాత్రము మనము అంగీకరించవలెను. దీనివిషయమై యేమిన్నీ పొరపడవద్దు. త్యాగమునకు యేమాత్రమును వెనుదీయకూడదు. స్వాతంత్ర్యసంపాదకయి ధయిర్యముగా నిలచిన జయిలునకు పోయివచ్చిన నాస్నేహితులకు ముఖ్యముగా ఈవిషయమును చెప్పుచున్నాను.

ఆపని నేమరల జేసినయెడల మరల చెరసాలావాసమునకు బాల్పడదమను భీతిచే అట్టిపనినిమరల జేయుటకు వెనుదీతురేని అట్టివారు మనకుపనికిరారని ఘంటాపథముగా జెప్పుచున్నాను. తొలిసారికారాగృహవాసము వారలయెడ నిరర్థకమయ్యెను. అట్టివారలీ యుద్యమమున బ్రవేశింపకయుండవలసినది. ప్రవేశించిరేని చో శిక్షింపబడినంతనే విదేశ ప్రభుత్వ లకుమాపణ వేడుకొనియుండవలసినది. యీబాధలన్నిటికిని లోనయి పిమ్మట పశ్చాత్తాపబడుటకంటె తెలివితక్కువ వేరొకటియుండబోదు. నేనుబీజపూరుజయిలులో నుండినప్పుడు యిట్లు వ్రాసియుంటిని. "పాపముచేయుచుండుటకంటె పాపమెట్టిదైనను కలదేని, ఆయ్యదిశిక్షింపబడినపిమ్మట చేసినదానికై వగపుచెందుటయే."

## — స్వాతంత్ర్యమునకు దగ్గరమార్గము. —

నెచ్చెలులారా! కడుదీర్ఘమగుకార్యక్రమమును మీ ముందు బెట్టితిని. మీకియ్యది చప్పచప్పగానున్నయెడల నేనేమియుచేయజాలను స్వాతంత్ర్యమునకు రాజమార్గము లేదు. దగ్గరత్రోవ యొక్కటియే గలదు. అదియెద్దియన మృత్యుసదనమునకు బోవుటయే అరుదియైనపరార్థమునకు రుచికల్గించునదియేదియన మహాకార్యముల సాధించుటకయి ప్రాణములర్పించుటయే మనకార్యనిర్వాహకవర్గములోని సభ్యులందరును యొక్కనాడు ప్రాణములర్పించుటకు సంసిద్ధులగుదురేని స్వరాజ్యము ఒక్కసంవత్సరములో తప్పక సమకూర్చెదనని జెప్పసాహసించుచున్నాను. వారితీర్మానము కేవలమునామమాత్ర వ్యర్థపదసంకలితముకాక సభ్యుల దృఢసంకల్పమును సువ్యక్తము జేయవలయును.

---

అట్టిసంకల్పమును, అఖిలభారతసంఘసభ్యులే బూనుదురేని స్వరాజ్యమొక్క మాసములో బడయగలము కాన నెచ్చెలులారా స్వరాజ్యముబు చేతులలోనున్నది. మీరందరును దేశమాతకేక బెట్టినప్పుడు మీప్రాణముల బలిదానముసంగుటకు సంసిద్ధులగునెడల యీరోజుననే స్వరాజ్యము స్థాపింపగలము. మనమిందులకు సంసిద్ధులము గాకుంటిమేని ఉత్సాహశూన్యమై చప్పచప్పగానున్నదని బార్డోలి కార్యక్రమమును దోసిపుచ్చితిమేని కాంగ్రెసు సభాలక్ష్యమును మార్చు

టకై చర్చించుట నిరర్థకము. కార్యాచరణకై నడుములబిగింతము అ
వసరమయ్యేనేని, మాతృదేశ స్వాతంత్ర్యసిద్ధికై ప్రాణముల నర్పింప
గంకణము గట్టుకొనెదము ఒక్కవత్సరమట్లు నిష్కళంకముగ కార్యాచ
రణకు గడంగిచూచెదము సంవత్సరాంతమున యీప్రభుత్వము మన
నాయక శ్రేష్ఠుని బిలువనంపి పశ్చాత్తాపమొందక పోవునెడల స్వరా
జ్యమును ప్రసాదింపక పోవునెడల యీశ్వరసాక్షిగా యొక్క [illegible]
మైనను యాలసింపక స్వాతంత్ర్యధ్వజము నెత్తెదము. ప్రజాస్వా[illegible]
ను వివిధమత సమ్మేళనము బ్రకటించెదముగాక, మిత్రులారా
యొద్దశలప్రాగైకొనుచున్న సభాధ్యక్షుడప్పుడు అచ్చటచ్చట
డను మానింపబడినట్లు బ్రిటిషు సామ్రాజ్యమున కాతనిబాధించు
వనముల తెంచివేయుట కిచ్చకింపకపోడు 1921 సంవత్సరమున న
క్కసంవత్సర కాలము నిర్ణయమొనర్చితిమి. ప్రభు[illegible]
క్కవత్సరమేగడు వొసంగితిమి కాని యీ యుద్దబడికలో మ
నెరవేర్పవలసిన షరతును నెరవేర్పలేదు. మనముగాంచిన అస
ర్ణకార్యములకు ప్రతిఫలముగ స్వరాజ్యము గోరజాలము. నాగపు
ర్యకార్యక్రమమునకు మరలుదము. ఇందు ఈశ్వరునిపై భారమువైచి మ
ధైర్యసైర్యములను. పట్టుదలయు వివేకము నొసంగుగాక, యని ఈ
శ్వరుని ప్రార్థించుచు నాయకశ్రేష్ఠుడు నిరూపించిన కార్యక్రమము
నిర్వహింప మరల మొదలుబెట్టెదము మన మాయనకు దగిన య
నుచరులమేయగుదుమేని పోయినస్వాతంత్ర్యమును మరల నెలకొల్పెదమ
విజయసిద్ధికై యొనర్చుప్రార్థనగాగాక, విజయమును బడసిన తీరిగా
ముజయధ్వానముగా మహాత్మాగాంధికిజై యనుశబ్దములగావింతము

మహాత్మ గాంధికి జై.

---

